


( నూతన సాంఘిక నాటకం )



రచన:

## శ్రీ సీతంరాజు వెంకటేశ్వరరావు



పబ్లిషర్సు:

## జయశ్రీ బుక్ డిపో,

ప్రొ.- శ్రీరాం శ్రీరాములు అండ్ సన్సు.

**విజయవాడ—2**

తొలికూర్పు 1000 ప్రతులు

 1955 [వెల రు **1-4-0**

## ఇది చదవండి!

ఇంతవరకు నేను ప్రజానీకానికి అందించిన నాటకాలలో 'పెళ్ళిచూపులు' 'పెళ్ళయ్యాకచూడు' అనే నాటకాలు రెండూకూడా వున్నాయని, అవి ఆంధ్రాలోను ఆంధ్రేతర ప్రాంతాల్లోనూ అన్ని నాటకాలతో పాటు విరివిగా ప్రదర్శనాలు జరుపుకుంటూ మలిముద్రణకు ముందుకు వచ్చాయన్న సంగతి అందరికీ తెల్సిన సంగతే. యిప్పుడు అందిస్తున్న యీ నాటకంపేరు 'పెళ్ళి' యీ నాటకం వ్రాయాలన్న అభిలాషగాని, వ్రాస్తానని గాని ప్రారంభించే టంతవరకూ లేదూ! గవర్నమెంటువారు ప్రథమ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలమీద ప్రాపకాండ సంబంధమైన నాటకం వ్రాయటానికని నెల్లూరు పిలిపించారు! అక్కడే వుంటూ "రామరాజ్యం" అనే నాటకం పూర్తిచేసి యిచ్చాను! ఆ సందర్భలో నే మిత్రుడు నారాయణబాబుతో పరిచయం జాస్తి అయింది. అతనే నన్నీ నాటకం వ్రాయమని ప్రోత్సహించి పురికొల్పాడు! తప్పనిసరై పది రోజుల్లో పూర్తిచేశేను! ఇకే నాటకాన్ని ప్రదర్శనాలివ్వాలని దీక్షపూనాడు. నాచేత వేషం వేయించాలని అతని తలంపు! అతని కోరిక ప్రకారం, ఇతర నటీనటుల సహాకారంతోనూ పదిహేను రోజులకే ప్రథమప్రదర్శనం (28-8-55) నెల్లూరు టౌనహాలులో జరుపుకుంది! పండిత పామరుల శుభాకాంక్ష నందుకొని మీ చేతులలో కొచ్చింది సహృదయంతో స్వీకరిస్తారు కాదూ!

## కృతజ్ఞత:- Checked 1963

ముఖ్యంగా యీ నాటకం వ్రాయటానికి ప్రోత్సాహ మిచ్చిన మిత్రులూ వి. నారాయణబాబు (వెంకటగిరి) సహాక రించిన యితర నటీనటులక్కు వెంటనే అచ్చొత్తించిన ప్రచు రణ కర్తలకు నా కృతజ్ఞత—.

## ప్రదర్శనా విధానం:-

ముందుగా శే పాత్రలు కంఠస్తంచేయాలి' రంగాలంకరణ విషయంలో శ్రద్ధచూపాలి! పాత్రలను అర్థంచేసుకొని నటిం చాలి! రెండో రంగంలో పెళ్ళి మంటపంతయారు చేసుకోవాలి! మంత్రం చదివే శాస్త్రివికూడా ముందే నిర్ణయించి ఆతనితో సహా రిహార్సల్సు జరపాలి! పుస్తకంలోలేని సీనులు, పాటలు ప్రవేశపెట్టకూడదు! మేళంకొరకు భజంత్రీలను కాని, ఆ సంబంధమైన రికార్డుకాని సిద్ధం చేసుకోవాలి,

## అలంకరణ:

పెళ్ళికుమారునికి. పెళ్ళికుమార్తెకు రెండురంగా లలోనూకూడా విధిగా కాళ్ళకుపారాణి, బుగ్గన చుక్క,నూతన వస్త్రాలంకరణ, రెండో రంగంలో భాషికాలు వుండాలి!

## హక్కులు:.

ఈ నాటకానికి సంబంధించిన సర్వహక్కులు జయశ్రీ బుక్‌డిపో ప్రొప్రయిటర్ శ్రీయుతులు శ్రీరాం శ్రీరాములు గారికి చెందియున్నవి సహృదయంతో మీమీ అభిప్రా యాలను నాకు తెలియపరుస్తారని తలుస్తా!

విజయవాడ 2
5-11-55

శైలవ్
సీతంరాజు

# అంకితం



తల్లిదండ్రులకు, బంధువర్గానికి దూరమై
శాశ్వతంగా కన్నుమూసిన మేనల్లుడు

రాంబాబుకి -
అశ్రు నయనాలతో అందిస్తున్నా !

రచయిత —

☞ 28-8-55 న తొలిసారిగా ప్రోగ్రసివ్ ఫ్రండ్స్ ఆర్టు థియేటర్ వారిచే నెల్లూరు టౌనుహాలులో ప్రదర్శించినప్పటి —

## నటీనటులు

| | |
|---|---|
| ఆశ : | శ్రీమతి వరలక్ష్మి |
| వాసు : | శ్రీ చదలవాడ |
| దాసు : | ప్రసాద్ |
| పురుషోత్తం: | సీతంరాజు (రచయిత) |
| వెంకటేశం : | లక్ష్మణరావ్ |
| పరమేశం: | రమణరావ్ |
| సీతయ్య: | నారాయణబాబు |
| ఇన్స్పెక్టర్: | శౌరిరాజ్ |
| శాస్త్రి: | నటరాజు |

## —♦ నిర్వాహకులు ♦—

| | |
|---|---|
| బ్రాండ్ మ్యూజికల్ యెఫెక్ట్సు | జయరాం అండ్ పార్టీ |
| ఆర్టు: | కేశవరావ్ |
| మేకప్: | ప్రోగ్రసివ్ ఫ్రండ్స్ ఆర్టుథియేటర్ |
| ప్రొడక్షన్ : | కేశవరావ్, నాగరాజు, సుశీల, రంగనాయకమ్మ వగైరాలు |
| డైరెక్షన్: | వి. నారాయణబాబు (వెంకటగిరి) |

# వచ్చే వేషాలు

* ఆశ
* వాసు
* దాసు
* పురుషోత్తం
* వెంకటేశం
* పరమేశం
* సీతయ్య

యింకా, యస్. ఐ., శాస్త్రి వగైరా...

## రంగాలు:- 2

1 విడిది          2 మంటపం

## కథా కాలం

రాత్రి 10 గంటలనుంచి తెల్లవారు ఝామున 3-30 గం॥ వరకూ రెండు కుటుంబాలమధ్య జరిగిన కల్లోలమే యిందలి కథావస్తువు —

---

## హెచ్చరిక

ఈ నాటకానికి చెందిన సర్వహక్కులు నాకు చెంది యున్నవి. నా వ్రాతపూర్వకమైన నా అనుమతిని ముందుగా పొందనిదే యేవిధంగానూ ప్రదర్శించరాదు. వ్యతిరేకించి ప్రవర్తించువారు నాచే జరుపబడు సివిల్ క్రిమినల్ చర్యలకు పూర్తి బాధ్యులగుదురని యిందుమూలంగా తెలియ పరుస్తున్నాను!

జయశ్రీ బుక్ డిపో,
రాజరాజేశ్వరీపేట,
విజయవాడ - 2.

ఇట్లు,
శ్రీరాం శ్రీరాములు.

---

'కల్యాణాత్మకమైన కృష్ణకథ నాకర్షింపుడీ గారడిన్'

# శ్రీ కృష్ణ గారడి

## రచన: తాండ్ర సుబ్రహ్మణ్యం

శ్రీ కృష్ణ లీలలోని చిద్విలాసం - తులాభారంలోని తూకం - గయోపాఖ్యానంలోని కల్పన - రాధాకృష్ణలోని రాగం - పాండవోద్యోగవిజయములలోని కవితాశిల్పం - అన్నీ అనన్య సామాన్యంగా వడియగట్టి ఆనందాన్ని గిలికించి అమృతంచిలికించి ఆంధ్రులకు అందజేయు అద్వితీయ పౌరాణిక నాటకం

వేలాది గొల్లభామల స్వేచ్ఛావిహారం కామకలాపమా? లేక విశ్వజనీనమైన విశిష్ట ప్రేమ భావమా? గోకుల సమాజస్వభావమేమి? గోకులంలో గగ్గోలు పుట్టిందా? పరమాత్మ అనే భక్తిలో సమాధాన పడిరా? వ్యభిచారమా? ప్రణయ మాధుర్యమా? మధురభావంతో ప్రేమసందేశమిచ్చి మానవకోటిని సంఘటిత పరచిన కృష్ణావతార తత్వాన్ని కూలంకషంగా చర్చించి చక్కని సన్నివేశములతో సరళమగు శైలితో సర్వోత్తమంగా సమర్పించిన నాటకం.

వైజయంతి అందాలరాశి. భావగీతాల మధురవాణి. గాయకి - నర్తకి - ప్రేమించటం ప్రేమకోసమనే ఆదర్శం. ప్రేమించి పెళ్ళిచేసుకోవాలనే సిద్ధాంతం - కృష్ణు అంటే ఎదురాడింది - అజ్ఞాతంగా అతనినే ప్రేమించింది. కాని ఆమెకు తెలియకుండానే అవతారానికి పెళ్ళామయినది. ససేమిరా అంది. సత్యాగ్రహం చేసింది. కాపురంపోయింది. కష్టాలు పడింది. ధర్మాన్ని వ్యతిరేకించలేదు; కర్మాన్ని అతిక్రమించలేదు. కృష్ణగారడీవల్ల సర్వం కల్యాణమయమైంది.

# ప్రార్థన

జయహో! జయహో!! జయహో!!!
కళామ తల్లికి జయహో! ॥జయ॥

కళారాధనకు నడుం కట్టితిమి
కళామతల్లీ కానుకగ
సమర్పింతుమూ మాశక్తి
దీవించుము మము ఓ జననీ ॥జయ॥

పావనమైన భారత భూమిపై
కళాకారులకు కన్న తల్లివై
కల్పవృక్షముగ కాపాడుటకై
కదలి రావమ్మ కళామ తల్లీ ॥జయ॥

జయముకై మేమూ జయభేరి మోగించి
జయ జయాధ్వానులతో విజయ శంఖంవూది
కర్పూర హారతులె నీకొసంగితిమి
కరుణించి కాపాడు కన్నతల్లి మమ్ము ॥జయ॥



# పెళ్ళి

## మొదటి రంగము

[అది పెళ్ళి వారికిచ్చిన విడిది! ఆ విడిదిలో వొక గది సమయం రాత్రి 10 గంటలు ప్రాంతం. ఆగదిలో యెదురు గోడను ద్వారం కొన్ని కొత్తగుడ్డలు వ్రేలాడుతూంటుంది. కుడిప్రక్క గోడకు వొకటి రెండు ఫోటోలు, వాటికి క్రిందుగా పూసలతోరణం, కనుర్లతో అలంకరించబడిన తరువాజ, ద్వారానికి కొంచెం పైగా కిటికీ, కిటికీ వూచలగుండా అవతల ప్రక్కనవున్న కొబ్బరిచెట్లు మట్టలు. వుండుండొకసారి కొబ్బరాకుల మధ్యనుంచి చంద్రుడు కనిపిస్తూంటాడు. రంగస్థలం మీద వొకమూలగా రెండు ట్రంకులు, వకప్రక్కన రెండు కుర్చీలు, మరొకప్రక్క టేబులు, దానిమీద అద్దం, పూల కూజ, కుర్చీలకు టేబులుకు మధ్యన పరుపు పక్కతో అలంకరించబడిన మంచం కనిపిస్తూంటాయ్! వాసు అద్దంలో తన అందాన్ని చూసుకుంటూ చిరునవ్వుతో తల దువ్వుకుంటూ వుంటాడు. కుడిప్రక్కన కనిపించే గుమ్మం అవతల ప్రక్కనుంచి గ్రామఫోను రికార్డులు వినిపిస్తూండగా తెరప్రక్కకి తొలుగుతుంది. "పెళ్ళి పెళ్ళి" అనే రికార్డుగాని, పెళ్ళికి సంబంధించిన యితర రికార్డుగాని వినిపిస్తూంటుంది! అటూ యిటూ వున్న గదుల్లోనుంచి యేవో మాటలు వుండుండొకసారి వినిపిస్తూంటాయ్! ఆ మాటలు క్రమేపీ వినబడకుండాపోతాయ్.[

వాసు- (దువ్వెన జేబులో పెట్టి) బావా!... అరేయ్ బావా.. విసుగుతో పెద్దగా) అరేయ్ ఫూల్ వెంకటేశం!

వెంక- (లోపలనుంచే) ఆఁ! యేమిటోయ్?

వా- ఇలాగా!

వెం- యెందుకు?

వా- రమ్మంటే!

వెం- (లోపలనుంచి వస్తాడు) ఏం?

వా- రికార్డులు ఆపేయ్!

వెం- నీకేంకష్టంగావుంది?

వా- వుందికనుకే!

వెం- (తెల్లబోయి) నాకేం లేదే!

వా- (మందలింపుగా) ఆపుతావాలేదా?

వెం- (యెగాదిగాచూసి) ప్రస్తుతం మనం దేని కొచ్చాం?

వా- పెళ్ళికి —

వెం- వున్నదెక్కడ?

వా- విడిదిలో

వెం- అవునుగదా!

వా- అయితే?

వెం- పెళ్ళివారికి కావలసిందేమిటి?

వా- నువ్వేచెప్పు!

వెం- వాళ్ళుమర్చిపోయే సంగీతం! మంచిసందడి! అవునా?

వా- ఊ!

వెం- యీసందర్భమే అలాంటిది! అవునంటావా?

వా- (వెంకటేశాన్ని చూస్తాడు)
వెం- అటువంటప్పుడు వద్దనడానికి నువ్వెవరు?
వా- (గర్వంగా) పెళ్ళికొడుకుని-
వెం- అయితే పెళ్ళిచేసుకో! అంతే!
వా- యేమన్నావ్?
వెం- నీ కర్తవ్యం అంతవరకే! తెలుసా?
వా- ముందు నోరుమూసుకు ఫోను మూస్తావా లేదా?
వెం- కాదంటే ఫోను మూస్తాను! పైపెచ్చు నేనుకూడా నోరు ముయ్యటం దేనికి? (యెగాదిగాచూసి) పెళ్ళికాకుండానే కళ్ళు మూసుకుపోయాయ్! నిట్టూర్చి) ఆ కాస్త అయినాక యింకా నీకు పట్టపగ్గా లుంటాయా! (నీరసంగా ఊఁ! (వాసుని పరీక్షగా చూస్తు) కాస్త వొళ్లు దగ్గరపెట్టుకు ప్రవర్తించాలిరా!
వా- (మందలింపుగా) ఊఁ!
వెం- (తెల్లపోయి) మెదిస్తే ముక్కూడిపోయేట్లుందేఁరోయ్! అంత ప్రమాదానికి మాత్రం దారితీయకు! (వాసు వెంకటేశాన్ని చూస్తాడు) మూస్తాన్లే ఫోను! (లోపలకు వెడతాడు)
వా- (వెంకటేశం వెళ్ళిన మార్గాన్ని చూసి చిన్నగా నవ్వుతాడు)
వెం- (లోపలనుంచి వచ్చి) మూశేన్లేరా ఫోను!
వా- (నవ్వి) వెరీగూడ్! సరేగాని బావా!
వెం- (సమీపిస్తు) ఏం?

వా- (ఆలోచిస్తూ) చూశేవా?
వెం- చూశేను! (తేరుకొని) యేమిటి?
వా- (నవ్వి గర్వంగా) అవబోయే భార్యని_
వెం- ఓహో!
వా- యెలావుందంటావ్?
వెం- యేమీ బాగోలేదంటాను!
వా- (తెల్లబోయి) ఆఁ!
వెం- అవును!
వా- మతిపోయిందేఁరా?
వెం- లేదే!
వా- మరి అందంగా లేదంటావేం?
వెం- యెవరు?
వా- పెళ్ళికూతురు!
వెం- బాగుండచ్చు!
వా- బాగోలేదందెవర్ని?
వెం- తెలుసుకో!
వా- (విసుగ్గా) చెప్పరాంటే!
వెం_ నీపెళ్ళాం అందచందాల విషయంలో నన్నడగటం...
వా- బాగోలేదా? (నవ్వి) చూశేవుకదరా!
వెం- చూస్తే!
వా- నీ అభిప్రాయం తెలుసుకుందామని అడిగేను!
వెం- అదేవద్దంటా! నీకు తలకాయలేదూ?
వా- (హేళనగా) కనుపించడల్లా?

వెం— వున్నా లేనట్లేవుంది!
వా— యేం?
వెం— వుంటే యీ చొప్పదంటు ప్రశ్న లేమిటి? అంతగా కావాలంటే...
వా— సలహా యిస్తున్నావా?
వెం— యివ్వకుంటే బ్రతుకనిస్తావా?
వా— (నవ్వి) ఆ మాత్రం భయముంటేచాలు! యేమిటి నీసలహా?
వెం— టిపటాపగా డ్రెస్సు చేసుకున్నావుగా!
వా— (వెంకటేశాన్ని చూస్తాను) ఉ!
వెం— పెళ్ళివారంల్లుకూడా ప్రక్కనే వుందాయె!
వా— వుంటే?
వెం— యెరగనట్లుగా, యేదో పనున్నట్లుగా వాళ్ళగుమ్మం ప్రక్కనుంచి వెళ్ళు —
వా— (నొసళ్ళు చిట్లించి) వెడితే?
వెం— అక్కడ వొక క్షణం ఆగి బాగా పరికించిచూడు!
వా— చూస్తే?
వెం— యేముంది? యింట్లోనో బయటనో, పేరట్లోనో ఆ పిల్ల కనుపించ బోతుంది? కనుపిస్తే టకీమని వొక పోజు పారేసిరా!
వా— మంచిసలహే యిచ్చావ్!
వెం— యింతకంటే మరోసలహా యివ్వలేను! యివ్వను! మీరు పెళ్ళొచ్చే లోపుగా మనం రికార్డులు దంచేస్తుంటాం!

వా- అదా సంగతి! (హేళనగా) తెలిసిందిలే! మనం వెళ్ళినా వెళ్ళం! తమరు రికార్డులు వేయనూ వేయ్యొద్దు!

వెం- యేం చేద్దామంటావ్?

వా- కులాసాగా మాట్లాడుకుందాం!

వెం- యేమంటావ్ మాటలు?

వా- యింతేనా నీకు తెల్సింది? చెప్తాను కూర్చో! (రెక్క పట్టుకు కూర్చోబెట్టి) బావా! అసలు ఆ పిల్ల...

వెం- (విసుగ్గా) అబ్బబ్బబ్బ! చూశేవు కాదురా!

వా- ప్చ్! లేదురా! పెళ్ళిచూపులకి వెళ్ళినప్పుడు సరిగా చూళ్ళేదురా!

వెం- (నీరసంతో జాలిగా) యేం పాపం?

వా- యేముంది? తీరా వాళ్ళింటికి వెళ్ళేసరికి సంధ్య వేళ యింది! అప్పటికప్పుడే లోకమంతా చీకటికమ్మేసింది!

వెం- (నీరసంగా) ఆ సూర్యభగవానుడు కొంచెంసేపు ఆనీడలా నిల్చిపోయినా బాగుండేదిరా!

వా- పూర్తిగా వినవేం? (ప్రేమగా) రూపురేఖలు మసక చీకట్లో కూడా మైమరపించినాయ్!

వెం- యింకేం!

వా- (సందేహంగా) కలర్మాట్రే కనుపించలేదురా!

వెం- (నవ్వి) తెల్లవారుఝామున ప్రకాశంతిలో తళుక్, తళుక్ మంటూ మెరిసిపోతూ కనిపిస్తుంది! సరేనా!

వా- ఏడ్చేవులేరా!

వెం- (గుటకలు మింగుతూ) నేనా?

వా- ఇంతకీ పచ్చగానే వుంటుందా?

వెం- పాలిష్ చేసిన పెసరపప్పు రంగులో వుంటుంది! సరేనా!

వా- హేళన తగ్గించరా!

వెం- నీతొందర బాగుందేం! యింకో నాలుగ్గంటల్లో ఆ పిల్ల ప్రక్కన కూర్చొని పెళ్ళాడలోతున్నావ్! యింతలో అంత ఆదుర్దాయెందుకు? యిప్పుడు పిల్ల నచ్చకపోతే పెళ్ళి మానేస్తావా? మీ చెల్లెలు యేమంత అందంగా వుందని నేను చేసుకున్నాను? పిచ్చివాడా! నన్నడుగుతే ఆలి అనాకారిగానే వుండాలంటా!

వా- (అతినీరసంగా వెళ్లబోయి) కొంపతీసి అలాగే వుంటుందేంరా?

వెం- ఛాఛా! నిపెళ్ళానికేరా బంగారంబొమ్మ కాదుట్రా! కాకపోతే శాస్త్రధర్మం సెప్పాను! అంతే! (టైంచూసి) అబ్బాబ్! యిప్పుడు పదిగంటలైంది! ముహూర్తం మూడు గంటల మూడునిముషాల, మూడు శెకండ్లకట - వెంటనే పడుకోని వొక కునుకుతీయకపోతే చాలా యిబ్బందవుతుంది! కాస్సేపు పడుకో! నేనూ వెళ్ళి పడుకుంటాను! లోపలకు వెళ్ళబోతును)

వా- ఇదిగో బావా! వొక్కమాట —

వెం- (వెడుతూనే) మాటాలేదు మూటాలేదు వెళ్ళిపడుకో! (లోపలకు వెడతాడు వాసు చిరునవ్వుతూ అటూ యిటూ చూసి లైటు ఆర్పుతాడు. క్షణం ప్రేమగా చూస్తూ ఆలోచించి వెళ్ళి పడుకుంటాడు. బయట

నుంచి పురుషోత్తం చింతనిప్పుల్లాంటి కళ్ళతో వురిమిరిమి చూస్తూ గబగబావస్తాడు. నాల్గువైపులా చూసి వాసువ సమీపిస్తాడు)

పురుషోత్తం- ఒరేయే వాసూ! లే! (రెండడుగులు వేసి లోపలకు చూస్తూ) వెంకటేశం! వెంకటేశం!! (వాసు మంచంమీదనుంచి లేచి నెమ్మదిగా సమీపిస్తాడు)

వేం- (లోపలనుంచి నిద్దరమత్తుతో వస్తాను) యేమిటి మామయ్యా!

పు- వేంటనే బయల్దేరండి!

వేం- (నోసళ్ళు చిట్లించి) పెళ్ళివారింటికేనా? అప్పుడే యెందుకు? యెప్పుడో తెల్లవారుఝామునగా పెళ్ళి -

పు- పెళ్ళిలేదు గిళ్ళిలేదు వెళ్ళిపోవాల్సిందే యింటికి —

వా.. ఆఁ!

వేం- (వాసుని వొకసారిచూసి పురుషోత్తంతో) మామయ్యా! అర్థంలేకుండా మాట్లాడతున్నావ్! యేమయింది.

పు- వొల్లకాడైంది! అవన్నీ ఆనక మాట్లాడుకుందాం! బండికింకా టైముంది! యీపూట్లో వొక్కక్షణమైనా వుండకూడదు! బాబూరావు సుబ్బారావు యేరి;

వా- సినిమా కెళ్ళేరు!

పు- వేడితే వేళ్ళార్లే! వాళ్ళేవస్తారు! ముందు మనం వేళ్ళిపోదాం!

వా- (పురుషోత్తాన్ని దీనంగా చూస్తూ)

పు- (వాసుని సమీపించి) వాసూ! మీ అమ్మా వాళ్ళతో బయల్దేరమని చెప్పు! (కుర్చీలో కూర్చొని పుగాకుపాయి తీస్తుంటాడు)

వెం- నీ కోపానికి అర్థం లేదుమామయ్యా! జరిగిన సంగతి చెప్పవ్! ఊర్కే గడబిడచేస్తే యేంలాభం? అనే మాటల్లో అర్థం ఉండాలి!

పు- (చుట్టమడుస్తూ) అంతా వ్యర్థమయింది! మనిషై పుట్టాక మానాభిమానాలు వుండాలి.

వెం- ఎవరికి!

పు- పెళ్ళికుతురు తండ్రికి-

వెం- అంతపొరపాటేం చేశాడు?

పు- చేసిందంతా పొరపాటుకాదూ? నా పిల్లవాడికి పెళ్ళి కాదని, గతి గడవక వాళ్ళమ్మాయిని చేసుకుంటాననుకున్నాడు!

వా- [నెమ్మదిగా] — హుఁ నాన్నా!

పు. కాదూ లేనుగీనూ లేదు! బయల్దేరండి!

వెం- ఆలోచన లేకుండా ఏపనీ చేయకూడదు మామయ్యా! కాస్త వెనకా ముందూ ఆలోచించాలి!

పు- [లేచి] ఆలోచించే చెప్తున్నాను! [వాసుని చూస్తాడు. వాసు తలవంచుకొని యేదో ఆలోచిస్తుంటాడు. నెమ్మదిగా వాసుని సమీపించి స్థాయిగా] వాసూ! చదువు, సంపదవున్న నీకు పెళ్ళికాదని యెంచకు! రేపీపాటికి దీని తలతన్నిన సంబంధం తీసుగొస్తాను!

సరేనా! మొదట్లో తెలుసుగో లేకపోయాను! యింత పరువుతక్కువ వాళ్ళని యెక్కడా చూళ్ళేదు!

వా- (అక్కడ వుండలేక గబగబా లోపలకు వెడతాడు. బయటనుంచి పరమేశం వస్తాడు)

పు- అనేదొకటి ఆచరణలో పెట్టేదొకటి

పరమేశం- అదికాదు పురుషోత్తంగారూ!

పు- (విసుగ్గా) యేదికాదయ్యా! యీ సంబంధం మాట్లాడింది నువ్వేగా! అచ్చావిశేం చెప్పాను?

ప- మీ తప్పులేదు మీరు చెప్పారు!

పు- మరి? (చుట్టముట్టిస్తాడు)

ప- ఆయనమాత్రం యేం చేస్తాడు? (జాలిగా) చేయాల్సిన ప్రయత్నమంతా చేశాడు! కన్ను పొడుచుకున్నా కానీ పుట్టలేదు!

పు- దానికి మనుష్యుల్ని మోసం చేస్తాడా పెద్దమనిషి?

ప- యిందులో మోసమేముంది? పరిస్థితుల్నిబట్టి గడువు కోరేడు!

పు- అదిచాలదనా? పైగా నోటువ్రాసిస్తాడట.

వెం- బెట్టుగా వ్రాయించుకుంటే సరిపోదూ?

పు- యేంచేసుకుంటాం! కనీసం నాలుగ్గీసుకోడానికైనా పనికిరాదు

ప- (జాలిగా) ఆయనా రెక్కలాధారంగా బ్రికేవాడు! వొక్కసారిగా అయిదువేలు పుట్టాలంటే మాటలా? అక్కడికీ తంటాలు పడుతూనే వున్నాడు!

పు- అవన్నీ నాకనవసరం! 'పుట్టి కెగుర వేసినమ్మ స్వర్గాని కెగిరినట్లు' తాహతలేనివాడు తగుదునమ్మానని అయిదు వేలు కట్నం యివ్వడానికి యెందుకొప్పుకున్నాడు!

ప- అంతకంటే గత్యంతరం లేకపోతే యేంచేస్తాడు? (వేంకటేశం లోపలకు వెడతాడు)

పు- '<u>గంతకుతగ్గబొంత</u>' అన్నట్లు నా హాతకుతగ్గ సంబంధమే వెతుక్కోవాలి!

ప- వెతికేడు! వెతికి వెతికి వెర్రివాడైనాడు! చూడబోతే ఆడపిల్లని కన్న తండ్రి!

పు ఆయనకు వొక్కతే ఆడపిల్లయితే నాకు యిద్దరున్నారు! వుంటే?

ప ఈడొచ్చినపిల్లని యింట్లో పెట్టుకు యెంతకాలంవుంటాడి?

పు- అందుకని!

ప- నా బలవంతంమీదే మీతో వియ్యానికి అంగీకరించాడు! మీ కుర్రవాణ్ణి చేసుకోమని ప్రోత్సహించింది నేను! 'యేదో బియ్యే చదివాడు' 'కుర్రాడు బుద్ధిమంతుడు, చిన్నవయస్సు అందంగావుంటాడు, అని ఆ పెద్దమనిషిని పురిగొల్పాను! పాపం! నా మాట కాదనలేకపోయాడయ్యా! పురుషోత్తంగారూ! మీరు పెద్దలు! అన్నీ తెలిసిన అనుభవజ్ఞులు అనుకున్నది అనుకున్నట్లుగా జరక్క ఆలస్యమైందని అనుమానంతో అవమానించడం బాగోలేదు! రెండు రోజులు గడువిస్తే...

పు- (నిర్మోహమాటంగా) రెండునిముషాలుకూడాయివ్వనండీ!

ప- (విధేయంగా) పురుషోత్తంగారూ!

పు- ఈ విషయంలో యెవ్వరి మాటావినను! వృధాప్రయాసపడి కాలయాపనతో కాసపనికోసం కాలంగడిపినందువల్ల ఫలితం లేదు!

ప- అదికాదండీ! ఆయన యివ్వకపోతే నేను బాధ్యుణ్ణి! సరేనా! నా మాటనమ్మండి! నేనిస్తాను!

పు- (హేళనగ) ఆఁ! నువ్విస్తావ్ మేంతీసుకుంటాం! రెండూ నిజమే! (నవ్వి) మూడుముళ్ళూ పడేవరకూ యిలాచాలా మంచి మాట్లాడతారు! పరమేశంగారూ! చిన్నప్పటినుంచి పెంచి పెద్దచేసి వేలకు వేలు గుమ్మరించి చియ్యేవరకూ చదివించింది పూటకి తిండికి కాణీ లేని బీదపిల్లని చేసుకోటానికి కాదు! యిందును గురించి మీరేమనుకున్నా సరే! మీ దృష్టిలో నన్నొక దుర్మార్గుడుగా చూసినాసరే! నాకు కావలసిందీడబ్బు! యివ్వాల్సిన అయిదువేలకూ అర్ధణా తక్కువిచ్చినా యీ పెళ్ళి జరగదని మీ సీతయ్యగారితో చెప్పండి!

ప- అంతేనా! నామాట...

పు- యెవ్వరి మాటావినను!

ప- మీరింత పట్టుపట్టకూడదండీ? (వెంకటేశం లోపల నుంచి వస్తాడు) మొన్నటినుంచి విసుగు విరామం లేకుండా తిరుగుతూనే వున్నాను.

పు- తిరక్కుండా యింట్లో కూర్చుంటే పనవుతుందా? ఎవరి పనికోసం వాళ్ళు తిరగడంలో గొప్పేముంది?

వెం- అదికాదు మామయ్యా!

పు- ఈ విషయాల్లో నీకేం తెలియదు వెంకటేశం!

ప- (వెంకటేశంతో) కాదండి! యివ్వాల్సింది అయిదువేల కట్నం! నిలుచున్న పాటున నిలుచున్నట్లు కావాలంటే యెక్కణ్ణుంచి తెచ్చి పోస్తారండి?

పు. (వెటకారంగా) ఆ తాహతులేనివాడు పెద్దోత్తువాళ్ళతో పొత్తుకోసం యెందుకు ప్రాకులాడాలండి? వెనకా ముందూ ఆలోచించనక్కర్లా? అంతకట్నం ఇస్తామని యెందుకు మోసం చేయాలి?

ప- యిందులో మోసమేముంది?

పు- అంతా మోసమే! యీ వేషాలకేంలే!

వే - మామయ్యా! ముందు స్థితిని గుర్తించి స్థాయిగా మాట్లాడుకుంటే బాగుంటుంది! తీరూతారూ లేని మాటల్తో తగాదాకి దిగక జరుగవలసిన కర్తవ్యాన్ని గురించి ఆలోచిస్తే మంచిది ... (పరమేశంతో) చూడండి పంతులుగారూ!

ప- (వెంకటేశాన్ని చూస్తాడు)

వెం- పెళ్ళి కుమార్తె తండ్రిగారికి యేం వుద్యోగం?

ప- సీతయ్యగారికేనాడి ... వొక లఘాధికారి దగ్గర ...

పు- ఈ బిఘాధికారి గుమాస్తాట!

వెం- (మందలింపుగా పురుషోత్తంతో) మామయ్యా! పగవాడైనా మర్యాదిచ్చి మాట్లాడాలి!

పు- (వెంకటేశాన్ని కోపంగా చూస్తాడు)

ప- (వెంకటేశంతో పోనీలెండి అంటే అన్నారు! వీరు ఆన తగినవారు! సీతయ్యగారు పడదగినవారు!

వెం- అంతేలెండి!... నన్నడుగుతే మీా సీతయ్యగారు చాలా పొరపాటు పనిచేశేరండి! వందకాదు, రెండువందలు కాదు, ఆలోచన లేకుండా అయిదువేలు.... ...

ప- యిస్తాననడానికి మరోకారణముంది!

పు- (కోపంగా) యేమిటది?

ప- తన కుమార్తె వివాహానికి సాయపడవలసిందిగా అధికారిని కోరాడు! ఆయన మీాదుండే అభిమానం కొద్దీ ఆలక్షాధికారి సరేనని అంగీకరించారు! తీరా సమయానికి... ...

పు- (పరీక్షగా చూస్తూ ఈర్ష్యగా) యిప్పనన్నాడా?

వెం- (మందలింపుగా) మామయ్యా!

ప- వారి అదృష్టానికి తగ్గట్టు అన్ని అవాంతరాలూ అనుకోకుండానే వచ్చాయ్! ఆశచూపిన అధికారికి యేదో కాన్ఫరెన్సునుండి తలవని తలంపుగా పట్నంపెళ్ళారు. (నీరసంగా నిట్టూర్చి జాలిగా) అక్కడికేపాపం ప్రయత్నిస్తూనే వున్నారు!

పు- మీరెన్నన్నా చెప్పండి! మాతో బంధుత్వం కలుపుకోవాలంటే, మా కుర్రవాడితో వివాహం జరగాలంటే, తలతాకట్టు పెట్టయినా సరే ముహూర్త కాలానికి వరాండప్పు మాకివ్వాల్సిందే! అలా జరపలేకపోతే యేమీలాభం లేదు !

ప- దయ చూపలేదండి?

పు- అనే నిస్సందేహంగా చెప్తున్నాను! అరగంటలో మాకే సంగతీ చెప్పాలి! దీనికేమాత్రం భిన్నంజరిగినా మేం వెళ్ళిపోతాం!

ప- (ఆలోచించి నీరసంగా) సరే! వస్తా, (వెళ్ళబోతాడు)

వెం- (వోకసారి పురుషోత్తంని చూసి పరమేశంతో) పంతులుగారూ!

ప- (ఆగి) యేమండి?

వెం- మీరుకూడా ప్రయత్నించండి! యేదో విధంగా అల్లరి కాకుండా పెళ్ళయ్యే మార్గం చూడండి!

ప- (వెంకటేశాన్ని నీరసంగా చూసి స్థాయితగ్గించి) ప్రయత్నిస్తా! (బయటకు వెడతాడు)

పు- (నవ్వుతూ లోపలికి వెళ్ళబోతాడు)

వెం- మామయ్యా!

పు- (ఆగి) ఏం?

వెం- యింత మూర్ఖపట్టుదలుండకూడదు!

పు- (నవ్వి) యిదివ్యవహారం! ఆహారంపట్ల వ్యవహారంపట్లా మొహమాటముండకూడదు వెంకటేశం!

వెం- దూరమాలోచించే మాట్లాడుతున్నావా?

పు- అంతే!

వెం- వొక విధంగా ఆలోచిస్తే యీనీ పట్టుదల మన పరువు ప్రతిష్ఠలకూ_డా మచ్చతీసుగోస్తుందేమో!

పు- ఏవిధంగా?

వెం- పీటలమీద పెళ్ళిపడిపోతే మళ్ళీ వాసుకి జన్మలో పెళ్ళవుతుందా?

పు- ఎందుకాదు?

వెం- ఈ సంగతి తెలుస్తే పిల్లనెవరిస్తారు?

పు- మా చక్క_గా యిస్తారు! పెద్దమండువా యిల్లు రెండు తోటలు, నలబయి యెకరాల మాగాణిగల భూస్వామి (నవ్వుతాడు)

వెం- అయితే!

పు- పిల్లనివ్వడానికైకాని, పెళ్ళికావడానికిగానీ ఆక్షేపణేముంది! (నవ్వి) నిక్షేపంగా అవుతుంది!

వెం- హుం! అవుతుంది! వాళ్ళు తెలియని ఆవేశంలోపడి నాజీవితాన్నే మార్చిపోయాన్! సిరిసంపదలున్నంత మాత్రాన సాంప్రదాయిసిద్ధాంతాలకు విరుద్ధంగా ఆడపిల్లల్ని కన్న యే తండ్రీ తన కూతురు సుఖాన్ని చేతులారా నాశనంచేయడు! చేయలేదు! దేనికైనా మంచి చెడుగు లుంటాయ్!

పు- నాకు తెలుసును! నువ్వేం చెప్పక్కర్లేదు! అప్రయోజకుల చెప్పే మాటల్నే ఆధారంగా తీసుకొని, నువ్వన్నట్లు ఆడపిల్లల్ని కన్నవాళ్ళివ్వరూ పిల్లనివ్వక పోతే బ్రహ్మచారిగా నే ఉండిపోతాడు

వెం ఈమాట నువ్వనాల్సిన మాటకాదు! తన పుత్రుని క్షేమంకోరి అతని భవిష్యత్తు కోసమే ఆహర్నిశలూ ఆరాటపడే యే తండ్రి యిలాంటిమాటనలేదు! (నవ్వి) యిలా ఆశీర్వదించడానికేనా నన్ను పెంచి పెద్ద చేసింది? నీ కళ్ళయెదుటివాడు బ్రహ్మచర్యం అవలంభించాలనే అభిలాష నీకుంటే అలాగే కానియ్!

పు (స్థాయి పెంచి) వెంకటేశం!

వెం- అవును మాట్లాడేది వెంకటేశమే! స్వార్థమానవ కల్పితమైన కులాల్లోనూ, సంఘాల్లోనూ కుక్కగొడుగుల్లాగా లేచే కుళ్ళుని కూకటివేళ్ళతో పెగల్చాలని ప్రయత్నించడం మంచిదికాదని యెంచను! కళ్ళెదగ్గర పేచీవచ్చిందని కట్టుకట్టి దీక్షతో కన్న కొడుకు సుఖాన్ని కాలరాయడం మంచిదికాదు! ఫలితంగా కోరి తలవంపులు తెచ్చుకోవాల్సివస్తుంది! నలుగుర్లోనూ తలెత్తుకు తిరిగే యోగ్యత లేకపోయాక ఆస్తి వుండి ప్రయోజనం లేదు!

పు- నీ ధర్మపన్నాలు నాకనవసరం! యిది నా స్వవిషయం! యిందును గురించి విమర్శించడానికి యెవ్వరికీ హక్కు లేదు!

వెం- నాకున్నది!

పు- ఏవిధంగా?

వెం- నీ అల్లుణ్ణికనుక-.

పు- అయినందుకు యెంతసరకుండాలో అంతసరకేవుందు!

వెం- వున్నానుకాబట్టే నీకీసలహా యిచ్చేను! ఏనాయి వాళ్ళయ్యేసరికి గుట్టుని పట్టుదలతో కప్పి జట్టాకి సిద్ధమయ్యావుగాని, ఆనాడే యీ పట్టుదల మాదగ్గరుంటే యేమయ్యేది!

పు- ఏమిటది?

వెం- నువ్వు నాకు కట్నం యిస్తానని అన్లేదూ?

పు- అంటె!

వెం- ఇచ్చేవా?

పు- చేసుకొనైతే తీసుకోలేకపోయావ్?

వెం- హుం! ఏ అంత మూర్ఖత్వానికి దారితీయలేక అయినవాడివని అభిమానం చూపించావు మానాన్న! మేనల్లుడనని మాటల్తో మైమరపించావు నువ్వు నన్ను అప్పుడే నీలాంగా మేమూ పట్టుపట్టినట్లయితే...

పు- వెంకటేశం! యిప్పుడు జరగబోయేది నాసుపెళ్ళి! గతాన్నిగూర్చి విమర్శించడానికి తీరికలేదు. యిప్పుడు, అంటే, యీ సందర్భంలో అసందర్భమాటలు వినదల్చుకోలేదు నాయిష్టానికి అయిష్టంగా, నా ఆశయాలకు విరుద్ధంగా ప్రవర్తించి, నామనస్సుకిష్టం కలుగజేయాలనే దృక్పథంతో ప్రయత్నించే వాళ్ళ మాట విననని స్పష్టంగా చెప్తున్నాను!

వేం- (స్థాయి పెంచి) మామయ్యా!
పు- తనసుతుడు ప్రయోజకుడు కావాలని పెద్దకట్నం తీసుకురావాలని సుతులుసికన్న ప్రతి తండ్రికీ వుంటుంది వెంకటేశం!
వేం- వుండవచ్చు! యేతండ్రీ! ఇంత దుర్మార్గంగా ప్రవర్తించడు.
పు- సన్మార్గం పాటించడంచేత కానివాళ్ళకు దుర్మార్గమే చెంపపెట్టు!
వేం- యెంత చెప్పినా నామనస్సుకి యెక్కడంలేదు! సునాయాసంగా వేలు సంపాదించాలనే అపేక్ష నీ చేత యీ విధంగా మాట్లాడిస్తోంది! పెద్దవాడివి! వాళ్ళకి నీతి చెప్పాల్సిన నువ్వే నుంచిపోయి మాట్లాడుతున్నావ్!
పు- మధ్య నీతో పోట్లాడాల్సిన అవసరం నాకు లేదు!
వేం- వుంటే యిలా యెందుకు ప్రవర్తిస్తావ్? మేనల్లుడవని, మీ యింటల్లుడననే చనువుతో మీకుటుంబ మంచి చెడ్డల్ని గమనించాల్సిన కర్తవ్యం నామీదకూడా వుందనుకొని భ్రమించాను! మీ సట్టుదల చూసిబాధ పడ్డాను! అయినవాళ్ళ మైనప్పటికీ మీతోపాటు యింత వరకూ తెల్సుకోలేక అజ్ఞాతంగా అల్లుడనచే ఆశతో సలహా యిచ్చాను అంతావృధాఅయింది! స్వాతంత్ర్యం లేని నీవంటి వాళ్ళతో మాట్లాడేకన్నా మాదార్ని మేము వెడితే మంచిది! (క్షణం ఆలోచించి) ఊ! వస్తాను మామయ్యా! (వెళ్ళబోతాడు)
పు- వెంకటేశం!

వెం- (ఆగుతాడు)

పు- యెందాకా?

వెం- మావూరు!

పు- ఆలోచించే వెడుతున్నావా?

వెం- అన్నీ తెలిసిన పెద్దవాళ్ళే దానికి స్థానం యివ్వలేదు!

పు- యిదే నిసమాధానమా?

వెం- అవడంలో పొరపాటులేదు!

పు- వెళ్ళాల్సిందేగా! (వాసు లోపలనుంచి వస్తాడు)

వెం- పట్టుదల అనేది అందరికీ వొకటే! నేనొక్కడినే వెళ్ళటంలేదు' మీ అమ్మాయిలుతో సహా వెడుతున్నాను!

పు- (నిట్టూర్చి) సరే! నన్ను అవమానించటమే లక్ష్యంగా పెట్టుకో దల్చుకుంటే వెళ్ళండి!

వెం- ఆదరించటం చేతకానివాళ్ళు అవమానించ కేంచేస్తారు? బావమరిది పెళ్ళని భార్యాసమేతంగా వచ్చేను గాని మీమీంతగాదాలమధ్య తలదూర్చి తలవంపులు తెచ్చు గోటానికి రాలేదు!... శెలవ్! (వెళ్ళబోతాడు)

పు- (కోపంతో) వెళ్ళండి! అంతా వెళ్ళండి! మీ బెదరింపులకు జడిసి మీకు వంగి వుంటానని మాత్రం తల్చకండి! (వెంకటేశం వొక్కసారి పురుషోత్తంని చూచి బయటకు వెళ్ళబోయి, మళ్ళీ వాసుని చూచి లోపలకు వెడతాడు) మీ చచ్చు ఆశయాలకోసం, మీ అసభ్యపు కోరికల్ని ఆచరణలో పెట్టిఅయినదానికికానిదానికి తలూపడానికి నేనేం గంగిరెద్దుని కానని గ్రహించండి!

వాసు- (పురుషోత్తంని సమీపిస్తూ) నాన్నా!

పు- ఏంవాసూ!

వా- కట్నం యిచ్చినా లేకపోయినా ఆ పిల్లనే పెళ్ళిచేసుకుంటాను!

పు- (మందలింపుగా) వాసూ!

వా- అవును నాన్నా!

పు- ఆలోచించే అంటున్నావా?

వా- అమలు జరుపుతారని ఆసిస్తున్నాను!

పు- అదేం లాభంలేదు! మనకున్న ఆస్థిపాస్తులకు నువ్వీ విధంగా కూటికిలేని కటికి దరిద్రుని కూతుర్ని కట్నం లేకుండా చేసుకుంటావట్రా? నువ్వీ దారుణానికి దారితీస్తే మన గౌరవం యేంకావాలి? మనకున్న పేరు ప్రతిష్ఠలకి సిగ్గులేక వొక పేదపిల్లకి పుస్తెకట్టి దాంతో తలెత్తుక కాపురం చేస్తావటా? నీ యీ వింతవైఖరి నాకు చాల చిన్నతనంగా వుంది వాసూ!

వా- కాదు నాన్నా! పేరుకి పేదవాళ్ళు కావచ్చు! అయితేనేం? అందానికి అందం గుణానికి గుణం వుంది!

పు- (చిన్నగా నవ్వి) అంతకంటె వెయ్యిరెట్లు అందకత్తెను, గుణవంతురాల్ని తీసుకొస్తాను! (కొంచెం విచారంగా) వొక్కగాన వొక్క కొడుకువు! నా ఆశలన్నీ నీ మీదనే పెట్టుకున్నాను. అవన్ని నిరాశచేస్తావా? ... వొక దరిద్రుడికి అల్లుడుగా...

వా- (విన్లేక) నాన్నా! సిరివున్నా లేకపోయినా సాంప్ర దాయంకల కుటుంబమని...

పు- వెంకటేశం చెప్పాడు కాదూ?

వా- యెవరు చెప్పినా ఆ అమ్మాయినే చేసుకుంటాను!

పు- దూరం ఆలోచించి పటుత్వం లేని పట్టుదలకోసం పెనుగులాడు! ముందు స్థితిని గుర్తించక, యితరుల మాటల్ని ఆధారంగా తీసుకుంటే నిలువనీడ లేకుండా అవస్థలు పడాల్సి వస్తుంది! యీనాడు సలహాలిచ్చిన వాళ్ళు ఆనాడు నిన్ను వాళ్ళపంచకూడా చేరనీయరు!

వా- అదికాదు నాన్నా!

పు- యేదైనా వినను! ఏ వివాహం నా యిష్టం మీదనే జరిగి తీరాలి! దీనికి యేమాత్రం భిన్నంగా ప్రవర్తించినా నా ఆస్తిలో చిల్లిగవ్వకూడా దక్కదు! (వాసు శూన్యంగా పురుషోత్తంని చూస్తాడు) అంతేకాదు! ఆనాటినుంచీ నీకూ నాకూ తండ్రి కొడుకుల సంబంధమే తెగిపోయింది!

వా- (విన్లేక) నాన్నా!

పు- ఆ పదాన్ని వుపయోగించుకోవాలనే అభిలాష అర్హత నీకుండాలంటే నా యిష్టానికి అయిష్టంగా ప్రవర్తించకు! వాసు (ఆలోచిస్తాడు) వాసూ! (సమీపించబోతాడు)

వా- (తేరుకొని) క్షమించు నాన్నా! (బయటకు వెళ్లబోతాడు)

పు- (పెద్దగా) ఆగు !
వా- (ఆగుతాడు)
పు- వాళ్ళింటికేనా ?
వా- అవును !
పు- నా మాట వినదల్చుకో లేదా?
వా- యీ విషయంలో విన్లేను !
పు- ఆమాటే ఖాయమా ?
వా- (మాట్లాడడు)
పు- మాట్లాడవేం ?
వా- మీరేన్నన్నా చెప్పండి ! అయిదువేలకోసం అయిన వాళ్ళని దూరం చేసుగోటం నాకిష్టంలేదు!
పు- నా ఆశయాన్ని వ్యతిరేకిస్తున్నట్లేగా!
వా- నా కర్తవ్యంకోసం బయల్దేరాను!
పు- కట్నం లేకుండానే కల్యాణం జరుగుతుందిగా!
వా- జరగచ్చు!
పు- నా ఆస్థితో నీకు సంబంధంలేదుగా!
వా- చెప్పలేను!
పు- అర్థంకాలేదు!
వా- అంతా ప్రయాణంకట్టారు! కొందరు మనతో చెప్ప కుండానే వెళ్లారు!
పు- వెళ్ళినవాళ్ళకోసం దిగులుపడక్కర్లేదు! పెళ్ళి చేసే పెద్దను నేను, తాళికట్టే పెళ్ళికొడుకివి నువ్వు వుంటేచాలు!

వా- వొక దేశం చెల్లాయితో సహా ప్రయాణం...

పు- అవని!

వా- ఆడపడుచు కన్నీటితో గడపదాటక నేనీపెళ్ళి చేసుకోలేను నాన్నా!

పు- ఆ జ్ఞానం వాళ్ళకుండాలి! అంతేగాని ఆడపడుచు మీదుండే అభిమానంకొద్దీ పెంచి పెద్దచేసిన తండ్రికి వంచన చేస్తావుటరా! నిన్ను దృష్టిలో పెట్టుకొని యెన్నో ఆశా సౌధాలు నిర్మించుకున్నానే! అవన్నీ కూల్చి నా కోర్కెలు తృణీకరిస్తావుటూ? నీకు సిగ్గు లేదూ? ఆడపడుచు వెళ్ళిపోతున్నదనే అదురుతో బెదిరి ఆస్తిపాస్తుల్ని విసర్జించి అనర్థాల పాలవుతావుటూ బుద్ధిహీనుడా!

వా- ఆస్తిపాస్తులకోసం, అయినవాళ్ళని, అందులో ఆడపడుచుని వొదులుకోలేను, యే శుభకార్యానికైనా అందరూవుంటేనే ఆనందం! మీకు వ్యతిరేకించి ప్రవర్తిస్తున్నానని బాధపడకండి! వస్తా! (వెళ్ళిపోతాడు)

పు- వాసూ! యిందును గురించి నీ మనస్సు మారదుగా!

వా- (ఆగి) మారదు!

పు- అయితే వొక్కమాట వినిపో! నీ సంతోషంకంటే నాకు కావలసిందేమీ లేదు! నేను చేసిందికూడా తప్పు కాదు! ఆదినుంచీవస్తున్న ఆచారాన్ననుసరించి కట్నం కోరేను! ఆనాడు నీ కిష్టమైనా యీనాడు వ్యతిరేకించేవ్! చెప్పుడుమాటలు వింటే యేవ్యక్తిలోనైనా

మాంద్యవస్తుంది ... యెవరో వాళ్ళు తగ్గకపోతే యెట్లాగు! (నిట్టూర్చి) సరే! నీ యిష్ట ప్రకారం కట్నం లేకుండానే పెళ్ళిచేసుకోనాయనా!

వా- (ఆశ్చర్యంగా పురుషోత్తంని చూసి ఆశగా) నాన్నా!

పు- అవును వాసూ!

వా- (పట్టరాని ఆనందంతో) నాన్నా! యిద్దరూ కౌగలించు కుంటారు)

పు- వాసూ!...మరో చిన్న కోరికకూడావుంది!

వా- యేమిటినాన్నా?

పు- నెరవేరుస్తానా?

వా- నమ్మకంలేదానాన్నా!

పు- మాట తప్పవుకదా!

వా- ఆ అవసరం యింతవరకూ రాలేదు!

పు- అయితే వినువాసూ! దారికి (అడ్డునిలబడి) ముందు నా ప్రాణంతియ్!

వా- (తెల్లబోయి) నాన్నా!

పు- హు! నాన్న! నాన్నమీద అభిమానం లేకపోయాక ఆ నాన్న బ్రతికినావొకటే చచ్చినావొకటే! (వాసు (వినలేక తలవంచుకు ఆలోచిస్తాడు) ఆలోచించకు వాసూ! యిది మన జీవితసమస్య! దాన్ని పెళ్ళాడ తల్చుకుంటే తక్షణం నన్ను చంపు! లేదా నేకావా లంటే నా యిష్ట ప్రకారం ప్రవర్తించు!

వా- శూన్యంగా చూస్తు (ఆశ్చర్యంగా) ఆఁ!

పు- అంతే! యిదేనా కడసారికోరిక! యీ ఘోరాన్ని కళ్ళారా చూళ్ళేము నన్ను చంపి దాన్ని హాయిగా పెళ్ళిచేసుగో! (వాసు తెల్లబోయి చూస్తాడు) అలా తెల్లబోయి చూస్తే ఫలితం లేదు వాసూ! రా! రా!! నాగత్రాన్ని కళ్ళారా...

వా- (పొంగి పొర్లే దుఃఖంతో) నాన్నా!

పు- మన యిరువురి మధ్యనా వున్న ఆ సంబంధం తెగ తెంపులు చేసుకోడానికే యింత ప్రయత్నం! తన పుత్రుడే తనకు తలవంపులు తెచ్చాక యింక ఆ తండ్రి యింతకంటె కోరేదివుండదు! ఆలోచించి లాభంలేదు. ముహూర్త ఘడియలు ముందుకు గాకపూర్వమే నన్ను చంపి నా గత్రాన్ని నీ నొసట తిలకంగా దిద్దుకొని హాయిగా పెళ్ళిచేసుగో!

వా- (ఆలోచించి మళ్ళీ పురుషోత్తాన్ని చూసి నిట్టూర్చి వెళ్లబోతాడు)

పు- (అడ్డు నిలబడి) నా కోరిక తీర్చకుండా వెళ్లడానికి వీల్లేదు!

వా- (ఆగి) క్షమించండి!

పు- (సన్నగా నవ్వి) యిది వొకళ్ళ నొకళ్లు క్షమించే సమయంకాదు! నువ్వుకాదు! అంటే నీకళ్ళయెదుట యేవిషాన్నో త్రాగి శాశ్వతంగా కన్నుమూస్తాను!

వా- ఆఁ! (నెమ్మదిగా) నాసుఖం కోసం వొక నిండు ప్రాణాన్ని, అందులో తండ్రిని...(ఆలోచించి పురు

పోత్తంని చూస్తూ) నాన్నా! (కాళ్ళు పట్టుకుంటాడు) మీ మనస్సుకి బాధ కలిగించిన దును క్షమించండి! తప్పయినా వొప్పయినా మీ యిష్ట ప్రకారమే నడుచుకుంటాను!

పు- (ఆనందంగో) వాసూ! (లేవదీసి) విచారించకు వాసూ! (దాసు బయటనుంచి వస్తాడు) యితరుల బెదరింపులకు ఆదరింపులకు జడిసి తొందరపడ్డావ్! అంతే! (నవ్వి) నీసంగతి నాకు తెలియదూ? వాసూ! తలాతోకా లేని యీ తప్పుడు సంబంధమంటే...

దాసు- యేది తప్పుడు సంబంధం? యెవరు తప్పుడు పనులు చేశేది? (వెంకటేశం గబగబా లోపలనుచి బయటకి వెడతాడు. వాసు వెంకటేశాన్ని అనుసరిస్తాడు)

పు- (దాసుని చూసి నొసల్లు చిట్లించి) యెవరు నువ్వు?

దా- వొక నిర్భాగ్యుని కొడుకుని, వొక అభాగ్యురాలి అన్నను!

పు- అంటే!

దా- అర్థం కాలేదా! (నవ్వి) ధనకాంక్షతో కళ్ళు కనపడని వాళ్ళకి యేంచెప్పినా వ్యర్థమే!

పు- మతి మందగించినట్లుంది!

దా- గతిలేకపోతేసరి!

పు- నీరాకకు కారణం?

దా- దారుణంగా ప్రవర్తించే వాళ్ళల్లో దయనే దుందేమో చూడటానికి! నేను...

పు- పెళ్ళివారి తాలూకా?
దా- మళ్ళ చెప్పాలా? పెళ్ళికూతురు అన్ననని ముందే మనవి చేశాను!
పు- కట్నం డబ్బు సిద్ధం చేశేరా?
దా- పట్నం వెళ్ళిన లక్షాధికారి రావద్దూ?
పు- (హేళనగా) యిది చెప్పడానికేనా తమరొచ్చింది?
దా- వియ్యమనే వంకతో కయ్యానికి కాలుదువ్వటానికేనా మీరొచ్చింది?
పు- సమయంకాని సమయంలో యేమిటి నీ వాదన!
దా- వాదనకాదు మహాశయా! వొక పేదవాడి రోదన!
పు- అదా నీ ఆవేదన? అర్థమైంది! కాని, నీ వ్యర్థ ప్రసంగం వినదల్చుకోలేను!
దా- అంతకంటే యేమనగలరు? మీరు మగపెళ్ళివారు! మీ రేదన్నా చెల్లుబడవుతుంది! అయినాసరె! మా కష్టసుఖాలు మీకు చెప్పి, అనుకున్న శుభకార్యాన్ని అల్లరిలేకుండా పూర్తిచేయించమని యాచించటానికే వచ్చేను!
పు- వచ్చిన దార్నే వెళ్ళిమ్చ! (హేళనగా) దరిద్ర పెద్ద మ్మలను ధర్మసన్నాలు మెండు అన్నట్లు?
దా- (స్థాయిగా) మామగారూ!
పు- (ఈర్ష్యగా) మామగారు! యిక్కడ నిను మామగారె వరూలేరు! యిప్పుడే నే చాలా పశ్చాత్తాపపడు తున్నాను! మీ కుటుంబ పరిస్థితి యీ విధంగా

వుంటుందని ముందే తెలిస్తుంటే మీ సంబంధానికే అంగీకరించేవాణ్ణికాదు!

దా- ఆ మహోపకారమే మీరు చేసినట్లయితే, మిమ్మల్ని యీ నాడీవిధంగా యాచించాల్సిన అవసరమేవుండేది కాదు.

పు- గతి గడవనివాళ్ళకు మతిలేని మాటలు భాగావస్తాయ్!

దా- (నవ్వి) సంపాదనే లక్ష్యంగా పెట్టుకొని సలక్షణంగా సాగిపోతున్న సంసారాల్ని స్మశానాలుగా మార్చే వాళ్ళకు యెలాంటి మాటలు వస్తాయ్?

పు- నీవంటి పరువు తక్కువ వాళ్ళ పనికి మాలిన ప్రశ్నలకు జవాబివ్వాల్సిన అవసరం నాకు లేదు!

దా- పరువుగల తమలాంటి పెద్దలు యితరుల్ని యేడ్పించటం కూడా తగిన పనికాదు! దయవుంచి నామాట వినండి పురుషోత్తంగారూ!

పు- (గర్వంగా) యితరులమాట వినడమనేది మన జీవిత జాతకంలో నేలేదు!

దా- వుంటే యింతవరకూ యెలావస్తుంది? యెదుటవాని కష్టసుఖాలు గమనించలేక ...

పు- (వుద్రేకంతో) ధనార్జనే నాజీవిత సాధనంగా యెంచాను! సరేనా?

దా- మన అన్నం మనం తిన్నా లోకానికి వెరవాలని తెల్సుకోండి!

పు- నీ సొకులు వింటానికిదిసమయం కాదు!

ఎదటివాడికి మేకలు చెక్కడానికే యిది సమయం!
ఎవరికైనా యింత మొండిపట్టుదల వుండకూడదు.
పురుషోత్తంగారూ! కట్నాలు యివ్వడంలో తాహత
వున్నవాళ్ళూ వుంటారు. లేనివాళ్ళూ వుంటారు!

పు- వుండవచ్చు! మా కుర్రవాడికి పిల్లనివ్వమని మేము కోరలేదు! మీకు మీరే అపామేళం ద్వారావచ్చి ప్రాధేయపడ్డారు! మాతో చుట్టరికం కల్పుగోటమే ముఖ్యంగా యెంచుకున్నారు! అయిదు వేలూ యిచ్చి లాంచనలన్నీ యధావిధిగా జరపాలని ఆనాడే చెప్పాను! యిస్తానని యెందుకు మాటయివ్వాలి! యిప్పుడీవిధంగా యెందుకు నడతపేచీ పెట్టాలి?

దా- పూచీలేని పేచీలకు దిగేదిమీరు! కట్నం...

పు- అనే పదం యీనాడు నేను సృష్టించింది నేనుకాదు! అది తరతరాలుగా వస్తున్న ఆచారం! అది వుంటేనే గౌరవం! అది తీసుకోని వాడి మొహంచూడకూడదు! దాన్ని కాదని ధిక్కరించడానికి ఎవ్వరికీ ఏవిధంగానూ హక్కులేదు. యీ వరకట్నమనే సమస్యను నేను కాదుకదా మొగపిల్లల్నికన్న ప్రతి తండ్రీ తలవంచి తీసుతాడు. యీ మాటల్నే గుర్తించుకో! అనవసరంగా మీరు అల్లరిపడి మమ్మల్ని అల్లరి చేయద్దు!

దా- (నిట్టూర్చి నీరసంగా) పురుషోత్తంగారూ! (యేదో చెప్పబోతాడు)

పు- (నవ్వి) యింతవరకూ చెప్పినదానికంటే చెప్పబోయే దాంట్లో నేను వినాల్సినదేమీ లేదని నాకు తెల్సును! నీ అంతరంలోని మాటకు బదులుగా మళ్ళీ జవాబు చెప్తున్నాను! పెళ్ళి జరగాలంటే డబ్బిచ్చి తీరాలి!

దా- ఈమాటే ఖాయమా!

పు- వేరే చెప్పాల్సిన అవసరంలేదు!

దా- మీలో దయ నేది మాసిపోయింది! జాల నేది నసించింది! మీరు మీ జీవితంలో కావాలని కోరి పూజించేది వొకటే! డబ్బు! దానికోసమే మీరు సృష్టించబడ్డారు. దానికోసమే మీరు జీవిస్తున్నారు. దానికోసమే మీరు ఎటువంటి దారుణాలకైనా దారి తీస్తారు. పురుషోత్తంగారూ సిరిసంపదలు అశాస్వితమైనవి యివ్వాళుండచ్చు! రేపు పోవచ్చు! వున్నా బ్రతికున్నంత వరకే కంటికి కనిపిస్తాయ్! యీ నగ్న సత్యం అనుభవశాలురు, ఆశావాదులు అయిన మీకు తెలియందికాదు!

పు- (హెచ్చరికగా) ధోరణి మితిమీరుతోంది!

దా- కారణం మీ ప్రవర్తనే! కాదని అనగలరా? ఆచారమంటూ ఆరంభించి అంతరంలో ఆర్జించటమే ఆశయంగా యెంచి, ఆడపిల్ల పెళ్ళిచేయాలనే అభిలాష గల వొక అమాయకుణ్ణి హింసించాలనే హాజంలో అతని కంఠాన్ని అడకత్తెరలోపట్టి, అనరాని మాటలూ అనడం అనుకున్నంత మంచిది కాదు.

పు- (నిర్లక్ష్యంగా) యీ రాజమ్మ కూతల కేంలే!

దా- మీరు యెలాంటి ఘోరాలు చేసినా తప్పు లేదు! మీరు చేస్తున్న అక్రమాల్ని, అన్యాయాల్ని చూసి సహించి మీ పాటకు వంతపాట పాడుతుంది సంఘం!

పు- (విసుగ్గా చూసి కోపంతో) హుం! (లోపలకు వెళ్ళబోతాడు)

దా- మాట్లాడు తూంటే వెళ్ళడం పెద్దమనిషి తరహా నుకుంటాను! పురుషోత్తంగారూ! మీకు ఆడపిల్లలున్నారు! వాళ్ళని వొకయ్య చేతుల్లో పెట్టుంటారు!

పు- పెట్టేను! మీ అంత నీచంగా నే పిల్లపెళ్ళి విషయం లోనూ ప్రవర్తించ లేదు

దా- కలిగినవాళ్ళు కాబట్టి అయ్యింది లేకపోయింది! మా యీ పేదస్థితిలోనే మీరుకుండి మీపిల్ల పెళ్ళికే ఇలాంటి అవాంతరాలొస్తే యేంచేస్తారు?

పు- మెడమీద కర్రేసి గెంటిస్తాను! అంతవరకూ రాకుండా నే మర్యాదగా వెడితే ఆనందిస్తాను! యింకోసారి పొల్లుమాటలొస్తే మాయెత్తు ధనంపోసినా మీపిల్లని చేసుకోమని ఖచ్చితంగా చెప్తున్నాను!

దా- మాటలకీ చేతలకీ చాలా దూరం! డబ్బు అనే జబ్బు మీలోవుంది! అదంటే మీకు యెక్కువప్రీతి! దాన్ని చూస్తే మీలో చెప్ప లేని భ్రమ కలుగుతుంది. దానికి వంగి గులామయి సలాంచేశే మీరు డబ్బిస్తే మా పిల్లనే కాదు పరువుని వొదిలి పడుపువృత్తితో జీవిస్తున్న వెర్రిబాగుల దాన్నయినా సరే చేసుకుంటారు!

నిజానికి మీరు మనుష్యులు కారు! ముసుగు కొని అభినయించు కొనే నరరూప రాక్షసులు! పేదవాళ్ళ రక్తాన్ని అనేక రూపాల్లో పీల్చి పిప్పిచేసే జలగలు—

పు- (రోషంతో) పిచ్చిగా కూస్తే పళ్ళూడతాయ్! (ప్ర

దా- యదార్థాలు లేక సంసారాల్ని కూల్చి సంచులు నింపుకోవాలనే వెర్రి ఆపేక్షతో వళ్ళు తెలియకుండా కళ్ళు మూసుకు కూసేది మీరు!

(పెద్దగా) ధార్మ్యమ్! (కిందపడుగు లేస్తాడు)

దా- మానవత్వాన్ని మరిచి, మహా మానవ గుణాల్ని సుగుణాలుగా ఎంచి పాటించే నీవంటి పశువులూ ధాగేసర పాతక చక్రవర్తుల అసహ్య ప్రవర్తన అరికట్టి వాళ్ళ నోరు మూయించటానికే నావంటి నిష్కల్మష జీవులు సృష్టించబడింది!

పు- (వెర్రి ఆవేదనతో) ఊఁ! (చంపేమీదకొస్తాడు)

దా- ఆఁ! (చంపసమిరించుకొంటూ కోపంతో మీదకు వెళ్ళి తగ్గుతాడు) తిరిగి చేయి చేసుకోవాలంటే నాకూ తెలుసు! కాని, మీలో లేని ఓర్పు మాలో వుంది! భగవంతుడు మీలాగే మమ్మల్ని సృష్టించాడు! మీకు డబ్బిచ్చాడు! మాకు అది యివ్వలేకపోయేడు! మమ్మల్ని పట్టి పీడిస్తున్న పేదరికాన్ని ఫరికర్తంగా తీసుకొని పశుప్రాయంగా ప్రవర్తించే మీవంటి ఘర్జనా పెద్ద మనిష్యులకే యివి రోజులు! అధర్మహంకారమే నిల్లువంతా నిండిపోయింది! అందుకే తొందరపడి మీరు

చేయి చేసుకున్నారు! నేనూ మీకంటే తుంటరి నయితే...

పు. అధికప్రసంగం మానకపోతే అంతకు మించిన ప్రాయశ్చిత్తం చేస్తాను! మర్యాదగా వెళ్ళు! మీ సంబంధం మాకొద్దు! యీ క్షణమే యీవూరునుంచి వెళ్ళిపోదల్చుకున్నాం!

దా- (నవ్వి యీర్ష్యగా) వెడతారు! వెళ్ళడం అనుకున్నంత తేలిక లేదు! రావటం మీయిష్టంగాని, వెళ్ళడం మీయిష్టంకాదు!

పు- (నొసళ్ళు చిట్లించి) యేమన్నావ్?

దా- పొలిమేరదాటి పోలేరు!

పు- పోతే?

దా- యేం చేస్తానా?

పు- యేం చేస్తావ్?

దా- అడుగు ముందుకి వేస్తే అనుభవంమీద మీకే తెలుస్తుంది!

పు- (హేళనగా) తాటాకు చప్పుడికి కుందేళ్లు బెదరవ్!

దా- నీనక్క విషయాలు యిక్కడకాదు! యింతవరకూ ఆడపిల్ల పెళ్ళని ఆశ్రయించాను.

పు- యిప్పుడు?

దా- ఆజ్ఞాపిస్తున్నాను!

పు- యేమని?

దా- కట్నం ఇచ్చినా లేకపోయినా మా ఉల్లాయిని చేసుకుతీరాలని —

పు- ఎంతసాహసం! మీలో యింత సాహసం వుండబట్టే మీ బ్రతుకు లిలావున్నాయ్! కాలేకడుపుకి గంజి లేకపోయినా ధర్మపన్నాలు మెండు! దరిద్రంతో ప్రాకులాడే వాళ్ళ చరిత్ర నాకు తెలియన్దికాదు! వాడిపోయిన మీ పాడు మొహాలు...

దా- (కోపంగా రెండడుగులు వేసి) ఆపు!

సీతయ్య- (బయటనుంచి వచ్చి ఆదుర్దాగా) దాసూ!

దా- (సీతయ్యని చూసి తగ్గుతాడు)

సీ- పెద్దా చిన్నా యేమీ చూడక్కర్లా?

పు- (హేళనగా) కారుకూతలతో కలవరపెట్టి కార్యం సాధించాలనే కలవరింతలు!

దా- నిలువంతా విషంతో నిండిన నీవంటి...

సీ- (మందలింపుగా) చాల్లే వూరుకో!

పు- (దాసునికోపంగా చూస్తాడు)

దా- (సీతయ్యని చూసి శాంతంగా వూరుకుంటాడు)

సీ- నోటికి యెంతమాటొస్తే అంతేనా? వెనకా ముందూ చూడాలి!

దా- (స్తాయిగా) నాన్నా!

సీ- అసలు నువ్విక్కడికెందుకొచ్చావ్?

దా- గుండెల్లో రేగిన మంటలు చల్లార్చుకోటానికి! అనాచారాన్ని అరికట్టి సదాచారాల్ని స్థాపించడానికి—

పు- (హేళన కోపం మిశ్రితంచేసి) ఆఁ! దేశాన్నుద్ధరిస్తా నికి యీ నాటికి దిగొచ్చాడు మూలపురుషుఁడు! సిగ్గులేకపోతేసరి

దా- (ఆవేశంతో) షటప్! (పురుషోత్తం మీదకి వెళ్ళబోయి సీతయ్యని చూసి తగ్గుతాడు)

సీ- దాసూ! అది మనవల్లకాని పని!

దా- కాదని వూరుకుంటేనే వాళ్ళకి కాళ్ళొచ్చేది!

సీ- నామీద అభిమానముంటే వెంటనే యింటికెళ్ళు!

దా- కాదునాన్నా! వీళ్ళు...

దాసు- (సీతయ్యని చూసి తిరిగి పురుషోత్తంని కోపంగా చూస్తే పళ్ళుబిగించి గట్టిగా నిట్టూర్చి గబగబా బయటికి వెడతాడు)

సీ- (దాసు వెళ్ళాక పురుషోత్తంవైపుకి రెండడుగులేసి) బావగారూ!

పు- కొడుకుతో కయ్యమయింది! యింక తండ్రిలో మిగిలింది!

సీ- (వినయ విధేయతలతో) కాదు బావగారూ!

పు- (హెచ్చరికగా) యిక్కడ నీకెవరూ బావగారు లేరు. అవసరమైన విషయమేదన్నా మాట్లాడాలని వస్తే 'పురుషోత్తంగారూ' అని పిలవండి!

సీ- అలాగే, పురుషోత్తంగారూ!

పు- ఏంకావాలి!

సీ- మా దాసు అశుభం శుభం యెరుగని అమాయకుడు

వాణ్ణి క్షమించండి!

పు- ఇంతకన్నా యేమనగలవ్? అతను చేసిన తప్పుడు పను లను మందలించటం పోయి ఘనంగా క్షమించమని కోరుతున్నావ్! యోగ్యత లేని యిలాంటి వాళ్ళని ఏంచేసినా పాపం లేదు!

సీ- అనుభవ లేని పసికందు! వాణ్ణి నే మందలిస్తాను! మీరు మాత్రం నామాటల్ని ఆధారంగా తీసుకొని బాధ పడకండి!

పు- (సీతయ్యని ప్రక్కగా చూస్తూ) ఊఁ!

సీ- పెళ్ళికి తరలివస్తారా?

పు- డబ్బు సిద్ధంచేశారా?

సీ- యిక్కడే చెల్లించాలా?

పు- మటపందగ్గర చెల్లించినా సమ్మతమే!

సీ- దయచూపండి! తాత్కాలికంగా కొంతపైకం మాత్రం చెల్లిస్తాను!

పు- అలా కుదరదు! పూర్తిగా యివ్వాల్సిందే!

సీ- అంతేనా పురుషోత్తంగారూ!

పు- ఊఁ!

సీ- అవసరానికి రెండు వేలు మాత్రం దొరికేయ్! అవన్నా అనుకున్న కార్యం ఆగిపోతుందనే కంగారుతో కాళ్ళా వేళ్ళాపడి బ్రతిమిలాడుతే వొక కరుణామయుడిచ్చాడు! (చేతులు పట్టుకొని) యివి చేతులుకావు కాళ్ళు! యీ రెండు వేలూ తీసుకొని అనుగ్రహించి అనుకున్నపని

పూర్తి చేయించండి! తతిమా మూడు వేలూ రెండు మూడు రోజుల్లో యిస్తాను!

పు- వీల్లేదు! మొత్తంగా వొక్కసారేయిచ్చి తీరాలి! అది కూడా ముహూర్తానికి ముందర-.

సీ- (ఆదుర్దాగా) పురుషోత్తంగారూ!

పు- నన్ని విషయంలో పదేపదిసార్లు అడగకండి! నా నుండి వేరుమాటరాదు!

సీ- (తెల్లబోయి ఆలోచించి తేరుకొని) వస్తా! (వెళ్ళబోతాడు)

పు- సీతయ్యగారూ!

సీ- (ఆగుతాడు)

పు- మాకు మూడున్నరగంటలకు బండివుంది! అవవలసిన కార్యం పూర్తిచేసే తాహత లేకపోతే దయతో ఖబురుచేయండి! చేసిన పొరపాటుకి చంపలేసుకొని మావూరు మేం చేరుకుంటాం!

సీ- అలాగే! (వెళ్ళబోతాడు)

పు- అన్నట్లూ లాంచనాలన్నీ గుర్తున్నాయిగా! మళ్ళీ గుర్తు చేస్తున్నాను! ఆడబిడ్డ అత్తగార్లకు వొక్కొక్కరికి అర్ధనూటపదహార్లు, వెండికూజా బిందెలు, వెండిబొట్లు పెట్టెలు, పెళ్ళికుమారుడుకి వెండిచెంబు, వెండిపళ్లెం పట్టుబట్టలు, వగైరాలన్నీకూడా అక్కడే అంటే ఆనిమిషంలోనే వప్పచెప్పాలి! (వెళ్లబోయిఆగి) మరోసంగతి! మా కుర్రవాడు అలకపాన్పుమీద

మోటారుసైకిలు కోరుతానని వాళ్ళమ్మతో అంటుంటే మాపెద్దమ్మాయివిని నాతో చెప్పింది! పేచీలకుదారి తీయకుండా మాపూచీ తీరిపోవాలనే అభిప్రాయంతో మీాకే సలహా యిస్తున్నాను! లాంచనాలన్నీ...

సీ- యిస్తానన్లేదే!

పు- అన్నారో అన్లేదో మాకనవసరం! మీామామధ్యన వుండనే వున్నాడు పెళ్ళిళ్ల పరమేశం! ఆయనతో లాంచనాలన్నీ యథావిధిగా యిచ్చి తీరాలని ఆనాడే ఖచ్చితంగా చెప్పేను!

సీ- ఆయనీ సంగతి మాతో చెప్పలేదే!

పు- దానికి నేనేం చేయను? యే నిమిషాన లోటు జరుగుతే ఆ నిమిషంతోటే పెళ్ళి ఆపుచేయబడుతుంది! ముందు జాగ్రత్త మంచిది!

సీ- యిన్ని వస్తువులు...

పు- సమయానికి అందుబాట్లో లేకపోతే అదనంగాను మరో వెయ్యి రూపాయలు అమాం బాపతు క్రిందా జమ వేయించండి! అలాగయినాసరే! (చిన్నగానవ్వి ఆరిపోయిన చుట్ట ముట్టిస్తూ లోపలకు వెడతాడు సీతయ్య క్షణం ఆలోచించి బయటకు వెళ్లబోతాడు! తెరలో నాలుగు వైపులనుంచీ నవ్వులు వినబడతాయ్)

సీత- (ఆగి తెల్లబోయి అటూ యిటూ చూస్తూ యెక్కడిదీ వికటా అట్టహాసం?

అనిసీతి- (ఒక వైపునుంచి) యేమిటాలోచన? యెందుకాలోచన? నీ విద్యుక్త ధర్మాన్ని గుర్తించి ముందుకినడు!

సీ- యేంచేసేది?

అని. యేమన్నా చెయ్యి! యెటువంటి ఘోరాన్నైనా సరే! సిద్ధపడు! నీ గౌరవంకోసం అల్లాడు, ముద్దుగా పెంచుకున్న నీ ఆశ సుఖంకోసం, డబ్బు తెచ్చే విధానం చూడు!

సీ- (క్షణం ఆలోచించి) అవును! (గబగబా బయటకు బోతాడు)

నీతి- (మరొకవైపున్నుంచి) ఆగు! (సీతయ్య ఆగుతాడు) అమాయకుడా! యెక్కడికి నీ ప్రయాణం?

సీ- కట్నం డబ్బుకోసం!

నీతి- తాహతలేనివాడివి యెక్కణ్నుంచి తెస్తావ్?

సీ- (నెమ్మదిగా) అదీ నిజమే

పు- (తెరలోనుంచి) మొత్తం అయిదు వేలూ చెల్లించాలి దే!

సీ- (వెనక్కు తిరిగి) ఆఁ!

పు- మామూ మూడున్నరగంటలకు బండివుంది! అవవలసిన కార్యక్రమం పూర్తిచేసేంతాహత లేకపోతే దయతో ఖబురు చేయండి! చేసిన ఖర్చు పాటుకి చెంపలేసుకొని మాదారిన్మేం వెళ్ళిపోతాం!

సీ- యేంచేసేది?

అని- ఆలోచన లేకుండా అయిదు వేలూ యిస్తానని ఎందుకు మాటిచ్చావ్?

సీ— (పొంగిపొర్లే దుఃఖంతో) యిచ్చేను!

నీ— యిచ్చిన మాటకోసం నీపరువుని నాశనం చేసుకుంటావా?

అలి— పీటలమీద పెళ్ళి ఆపుకొని నీ బ్రతుకు బజారు పాలు చేసుకుంటావా?

సీ— అందుకని—.

అలి— యేదన్నా చేయ్! డబ్బుసంపాదించటానికి అనేక సాధనాలున్నాయ్!

సీ— (తెల్లబోయి నెమ్మదిగా) అనేక సాధనాలున్నాయ్! అవును!

అలి— అందుకే బయల్దేరు! మాటిచ్చావ్! నెరవేర్చాలంటే నీతిని వదిలిపెట్టు! యెలాంటి మోసానికైనా వెనుదీయకు! వెళ్ళు!

సీ— వెడుతున్నాను! వెడుతున్నాను! (వెళ్ళబోతాడు)

నీ— (నెమ్మదిగా నవ్వి) ఆగు! పేదవాడివైనా పరువుప్రతిష్ఠ అనేవి నీకున్నాయ్! అంధకారమైన నీ మనస్సుని తప్పుడు మార్గాన పోనీయకు! యింతవరకు నీతి నిజాయితీలతో బ్రతికిన నువ్వు నేడు కోరి తలవంపులు తెచ్చుకోకు అందుకోసం...

సీ— యేం చేయగలను?

అలి— వెళ్ళు! నువ్వు కోరేది ఆశ క్షేమం!

నీతి— మానవునికి కావలసింది నీతి—.

అలి— ఆశ క్షేమం!

సీతి- సీతి—.

అలి- (స్థాయిపెంచి) ఆశక్షేమం—.

సీతి- (స్త్రాయిగా) సీతి—.

(అంటూ యిరువైపులనుంచి 'ఆశక్షేమం' 'సీతి' అంటూ వెర్రిత్తేలాగు కేకలు వినిపిస్తాయ్. సీతయ్య కంగారుపడి అక్కడున్న కుర్చీలో కూలబడతాడు. అంతా నిశ్శబ్దం అవుతుంది. సీతయ్య తేరుకొని కుర్చీలోనుంచి లేచి గబగబా బయటకి వెళ్ళబోతాడు. బయట నుంచి వెంకటేశం వాసు వస్తారు)

వెంక- (సీతయ్యని ఆశ్చర్యంగా చూస్తూ) మీరు...

వాసు- (నీరసంగా) ఆ అమ్మాయి తండ్రి...

వెం- (సీతయ్య) చూడండీ!

సీ- (జాలిగా చూస్తాడు)

వెం- (వాసుతో) వాసూ! యిలా రా!

వా- (సమీపిస్తాడు)

వెం- చూశేవా! మీ నాన్న యిరికించిన కత్తులబోనులో నుంచి బయట పడలేక యెలా కొట్టుకుంటున్నాడో ఆ పెద్దమనిషి...

వా- (నొసళ్ళు చిట్లించి) బాగా!

వెం- మీనాన్న గుండె చలనంలేని రాతిబండలాంటిదిరా వాసూ! పాపమూ...

సీ- (తేరుకొని) తమరెవరో తెలియదు! వొకరి బ్రతుకోసం మరొకర్ని నిందించటం అంతబాగోలేదు!

వెం- పైకం...

సీ- రెండు వేలుంది!

వెం- అసచ్చి తతిమాది తర్వాత యిస్తానని చెప్పలేక పోయారా?

సీ- చెప్పేను!

వెం- యేమన్నాడు?

సీ. లాభంలేకపోయింది!

వెం- (నిట్టూర్చి వాసుని చూస్తాడు)

వా- (అక్కడుండలేక లోపలకు నెమ్మదిగా వెడతాడు)

వెం- నాకు తెలుసు అలా అంటాడని! యీ తప్పు ఆయనది కాదు! [లోపలకు వెడుతున్న వాసుని చూపించి] వాడిది! యిటువంటి వాళ్ళని ఆశ్రయించి లాభంలేదు! ఈ ఘటాలు మంచికోసం తాపత్రయపడరు! వాళ్ళకు కావలసింది డబ్బు! దానికోసమే వాళ్ళు పుట్టిపెరిగేది! విలాసానికి కులాసాగా కాలంగడిపే వాళ్ళకు కటికి దరిద్రుల యిక్కట్లు కనిపించవ్! [సీతయ్య వేంకటేశాన్ని చూస్తాడు] నేనెవరో మీకు తెలియదు తెలియకుండా వున్నందుకే సంతోషిస్తున్నాను! నా మాట యందు యేమాత్రమున్నా మీరు విశ్వాసం వుంచదల్చుకుంటే యీ సంబంధం వెంటనే రద్దుచేసుకోండి!

సీ- [నీరసంగా నవ్వి] అలా చేయటం కోరికష్టాల్ని తెచ్చుకోడమే! పేదవారంటే గిట్టని యీ రోజుల్లో అలజడి

బయట్లేరి అకారణంగా అనేక అపోహలకి గురికావల్సి వస్తుంది!

వెం– అందుకని లేనిబాధల్ని కొని తెచ్చుకుంటారా?

సీ– అంతకంటే కర్తవ్యమేమీలేదు! నా కష్టాల్ని గురించి నాకు చింతలేదు! (విచారంగా) శుభమాంటూ ఆడపిల్ల పెళ్లి చెయ్యబోయి దాన్ని అల్లరిపెట్టి నేను అల్లరి పాలవుతున్నాననే బాధమాత్రం నాహృదయాన్ని రంపపుకోతకోస్తున్నది. (తేరుకొని) క్షమించండి! ముహూర్త ఘడియలు సమీపిస్తున్నాయ్! తలిమా నాల్గువేల కోసం తంటాలు పడాలి! వస్తా! (వెళ్ళబోతాడు)

వెం– రెండు వేలున్నాయన్నారు!

సీ– వుంటే ?

వెం– కావలసింది యింక మూడువేలేగా!

సీ– యితర లాంచనాలు యివ్వాలని ముందు చెప్పలేదు!

వెం– (నొసల్లు చిట్లించి) యిప్పుడు చెప్పాడా?

సీ– లాంచనాలన్నిటి క్రిందా అదనంగా మరోవెయ్యి యివ్వమన్నారు! వస్తా! (గబగబా బయటకు వెడతాడు)

వెం– (యీర్ష్యగా) యెంతమోసం! (సీతయ్య వెళ్ళిన మార్గాన్ని చూస్తూంటాడు. లోపలనుంచి వాసు వస్తాడు)

వా– ఆయన వెళ్ళిపోయారా?

వెం– నేనూ వెళ్ళి పోతున్నాను!

వా— మళ్ళీ యేం మాటలు బావా? యింతకుముందే మన్నావ్?

వెం— యేమన్నా వెళ్ళాల్సిందే! యీవెళ్ళడం నీమీద అభిమానంలేక నీపెళ్ళి చూళ్ళేక కాదు!

వా— మీరెందుకు?

వెం— మనసుండీ యితరులకు జరిగే పరాభవాన్ని చూళ్ళేక వాసూ! వెడుతున్నానని అన్యదాతల్చకు! (లోపలకు చూస్తూ) యేమే! పెట్టె బెడ్డింగు సర్దు! నేవెళ్లి బండీ తీసుకొస్తాను? (వెళ్ళబోతాడు)

వా— బావా!

వెం— (ఆగి) యెందుకు?

వా— పెళ్ళి కాకుండానే వెడతావుగా!

వెం— ఆ యోగం నీ మొహాన కనుపించటంల్లేదు!

వా— యెందుకని?

వెం— యీ ప్రశ్నకు జవాబివ్వాల్సింది మీనాన్న!

వా— వెళ్లడానికి వీల్లేదు!

వెం— మాట దక్కించటమనేది మనవంశంలో నేలేదు!

వా— యిదే సమాధానమా?

వెం— అనుకుంటే సంతోషమే!

వా— అయితేవిను, పెద్దవాళ్ళు యివ్వాళుండవచ్చు రేపు పోవచ్చు! వాళ్ళ ప్రతిజ్ఞలకోసం మీరు వెడితే నామీ మధ్యవున్న బంధుత్వంగాని, స్నేహంకాని, నాలుగు కాలాలుపాటు సిరస్థాయిగా వుండదని గ్రహించు!

మన సంబంధం తెంపుకోవాలనే తలంపు నీకుంటే వెళ్ళవచ్చు' (లోపలకు వెళ్లబోతాడు)

వెం– (వాసుని ఆదుర్దాగా చూసి) వాసూ !

వా– (ఆగి) దానికి తిరుగులేదు' ఆలోచించి అటో యిటో నీమనస్సు యెటులాగుతే అటు చేయవచ్చు'

వెం– (వొక్కసారి వాసుని యెగా దిగా చూసి లోపలకు వెడతాడు. వాసు వెంకటేశం వెళ్ళిన మార్గాన్ని చూసి చిన్నగా నవ్వుతాడు! తర్వాత కూనిరాగం తీస్తూ లైటు ఆఫ్‌చేసి వెళ్ళి పడుకుంటాడు! కిటికీకుండా కనుపించే కొబ్బరిమట్టలు గాలికి వూగుతూంటాయి. నిండు చంద్రుడు వుండుండొకసారి ఆకులమధ్యనుంచి గదిలోకి పంపుతూంటాడు సరి రెండు నిముషాలకు ఆశ మేలి ముసుగుతో నెమ్మదిగా బయటతలుపునెట్టి గదిలోకి ప్రవేశిస్తుంది. నాలుగువైపుల పరికించి చూస్తుంది. మంచంమీద పడుకున్న వాసుని గుర్తు పట్టి వెలుగు గదిలో లేనందువల్ల వాసుని పరిశీలిస్తుంటుంది. వుండుండొకసారి గదిలోకితొంగిచూసే వెన్నెల కాంతిలో పారాణి కాళ్లు చూస్తుంది. వాసు అని తెలుసుకుంటుంది. మొహం చూస్తుంది. విచారంలోనే పొంగిపొర్లే ఆనందం యెక్కువయి వొక్కసారిగా రెండుపాదాలూ పట్టుకుంటుంది వాసుపాదాల్ని తన కళ్ళకి అద్దుకుంటుంది. వాసు లేచి చీకట్లో ఆశని ఆశ్చర్యంగాచూస్తాడు)

వా— యెవరు? (లైటువేస్తాడు) ఆఁ! నువ్వా
ఆ— (నెమ్మదిగాలేచి) అవును! నేనే! ఆశని —
వా— యెందుకొచ్చేవ్?
ఆ— ఆశ్రయ బిక్షకోసం —
వా— (నొసళ్ళు ముడేసి) ఆశ్రయాబిక్షా!
ఆ— ఆడదానికి కావలసిందదే!
వా— యేమిటి నీధోరణి?
ఆ— కరుణిస్తారని గంపంత ఆశతో వచ్చేను!
వా— (వొక్కసారి ఆశని కర్తవ్యంగాచూసి అటుయిటు తెరచి వుంచబడిన తలుపులు బిగించుతాడు) లేచి మంచంమీద కూర్చో!
ఆ— (కూర్చుంటుంది)
వా— అర్ధరాత్రి వంటరిగా...
ఆ— తప్పనిసరైంది! తలవని తలంపుగా వచ్చేను!
వా— మీ వాళ్ళకు తెలుసా?
ఆ— తెలుస్తే రానిస్తారా?
వా— యిప్పుడు తెలుస్తే యేమవుతుంది?
ఆ— యెందుకెళ్ళావని చివాట్లు పెడతారు!
వా— దానికి నీ జవాబు?
ఆ— మీకిచ్చిన జవాబే అక్కడా యిస్తాను!
వా— మావాళ్లెవరన్నా చూస్తే?

ఆ- కోప్పడతారని సింగారుపడుతున్నారా? ... అన్నీ తెలిసిన వారు, చదువుకున్నవారు, ఆమాత్రంజవాబివ్వలేరూ?

వా- (తెల్లబోయి) నేనా?

ఆ- ఏం?

వా- యేంచెప్పేది?

ఆ- ఆలుమగలు కల్సుకోవటంలో అపరాధం లేదని.

వా- పెళ్ళి కాకుండానే!

ఆ- రెండుమూడు గంటల్లో అవబోతోందిగా!

వా- కట్నంసంగతి తేలద్దూ?

ఆ- తేలుతేనేగాని జరగదా?

వా- అనేగా మానాన్న చెప్పింది!

ఆ- మీరనేదికూడా అదేన?

వా- నాన్నమాట కాదనగలనా?

ఆ- ఆమాత్రం స్వాతంత్ర్యం లేదూ?

వా- వుంటేమాత్రం? యిప్పుడేంలాభంలేదు! వ్యవహారం మినిట్సుమీద లిమిట్సు దాటిపోయింది. కట్నం యిస్తేనే కల్యాణం జరుగుతుంది!

ఆ- మీరు కోరేది కట్నమా? అనురాగమా?

వా- ముందు కట్నం! తర్వాత అనురాగం!

ఆ- దేనికి ప్రాముఖ్యతనిస్తారు?

వా- ముందు కట్నానికే!

ఆ- చదువుకున్నవాళ్ళనాల్సిన మాటేనా?

వా- (గర్వంగా) అందుకేగా అంటున్నది! డొక్క-శుద్ధిలేని దౌర్భాగ్యుడు కట్నంకావాలని భీష్మించుకుకూర్చుంటే సాగుతుందా?

ఆ- (యీర్ష్యగానవ్వి) మనకంటే వాళ్ళల్లోనే మంచి మర్యాద వున్నాయేమో!

వా- పోనీ, అలాంటివాణ్ణేచూసి చేసుకోరాదూ?

ఆ- అవబోయే భార్యకివ్వాల్సిన జవాబేనాయిది?

వా- తప్పేముంది?

ఆ- వుందో లేదో మీకు తెలియదూ?

వా- లేదనే నా నమ్మకం!

ఆ- వరవిక్రయం పుస్తకం చదివేరా?

వా- చదివినట్లే గుర్తు!

ఆ- దానిమీద మీ అభిప్రాయమేమిటి?

వా- చదివినంతశేపూ కులాసాగా వుంటుంది!

ఆ- తెల్సుకున్న నీతేమిటి?

వా- అందులో వున్నట్లు మసులుకోవాలనుంవా!

ఆ- ఆమాత్రానికి చదవటం దేనికి?

వా- కాలక్షేపానికి —

ఆ- మీ ప్రవర్తన సాంఘిక అభ్యున్నతికి అంగరాయం కలిగించటంలేదూ?

వా- (కొంచెం విసుగ్గా) యేమిటీ అర్థంలేని మొండివాదన? అసలు నువ్వెందుకు వచ్చినట్లు?

ఆ- మాదీనస్థితి చెప్పి వొప్పించటానికి —

వా- అందుకే అయితే, ప్రస్తుతంలో నేనేం వినదల్చుకో లేదు!

ఆ- మీకు ప్రేమించటం చేతకాదా?

వా- అంటే?

ఆ- నాకోసం త్యాగం చేయలేరా?

వా- అస్వతంత్రుణ్ణి!

ఆ- అంతేనా?

వా- అవును! నేను తల్లిదండ్రుల చాటువాణ్ణి! వాళ్ళని వ్యతిరేకించి వాళ్ళ ఆశయాలకు విరుద్ధంగా ప్రవర్తిం చటంచేతకాదు! వృధా ప్రయాసతో నా దగ్గర ప్రాధేయపడి అడిగినందువల్ల ఫలితం శూన్యం! (స్థాయిగా) అదుపులేకుండా అర్ధరాత్రి ఆడదానివి వొంటరిగా రావటం తప్పని గ్రహించి వెంటనే వెడితే సంతోషిస్తాను. (కిటికీ దగ్గర కెళ్ళి వూచలకుండా బయ టికి చూస్తాడు)

ఆ- (వాసుని మొగాడిగా చూసి నిట్టూర్చి) సరే! వెడు తున్నాను! (రెండడుగులేస్తుంది)

వా- ఆశా! (సమీపిస్తాడు)

ఆ- (ఆగుతుంది)

వా- వొక్కమాట —

ఆ- ఏమిటది?

వా— యింత విడిదిల్లోనే నీగదిలో ఒంటరిగా వున్నావని యెవరు చెప్పేరు ?

ఆ— పక్క వేసిన చాకలి

వా— అడిగేవా ?

ఆ— మా అన్నయ్యతో అంటుంటే విన్నాను !

వా— (ఆశని ప్రక్కగా చూస్తూ) ఊఁ!

ఆ— వస్తా! (వెళ్ళబోతుంది)

వా— చూడు ! యింటి వరకూ సాగనంపేదా ?

ఆ— మీకేమిటి సంబంధం ?

వా— అర్థంకాలేదు.

ఆ— అవను! (చిన్నగా నవ్వి) అభిమానంలేని మనుష్యులకు అంత శ్రమ యివ్వదల్చుకోలేదు! పేదవాళ్ళమైనప్పటికీ మంచి మర్యాదలకోసం ప్రాకులాడుతూనే వుంటాం! నడివీధిలో అర్థరాత్రి అర్థం లేకుండా పరాయి పురుషుణ్ణి వెంటపెట్టుకు నెడితే విన్నవాళ్ళకి విడ్డూరంగాను, చూసేవాళ్లకు ఆశ్చర్యంగానూ వుంటుంది. లేని అపనిందల్ని కోరి తెచ్చుకోవల్సివస్తుంది ! అభిమానం చంపుకొని యాచించినందుకు నాపైన యీ మాత్రమైనా దయకలిగినందుకు సంతోషిస్తున్నాను... శెలవ్ ! (వెళ్ళబోతుంది)

వా— కోపం వచ్చిందా?

ఆ— (ఆగి) యెందుకు కోపం?

వా- యిలా మాట్లాడా. శ్రీ —
ఆ- తప్పు నాదగ్గరుంది కాబట్టి మాట్లాడేరు !
వా- మీ నాన్న డబ్బుకోసం ప్రయత్నిస్తున్నారా ?
ఆ- అవన్నీ విరమించుకున్నట్లే !
వా- ఒకవేళ ఆ ప్రయత్నంలోనే వున్నారేమో !
ఆ- మీ కెలా తెల్సును ?
వా- యింతకు ముందేగా మాట్లాడెళ్ళింది !
ఆ- ఏమని?
వా- రెండువేలుఁదిట! తతిమాదానికోసం...
ఆ- ప్రియత్నించినా పెళ్ళి జరగదు!
వా (తెల్లబోయి) ఆఁ!
ఆ- ఈ సంబంధం నాకిష్టంలేదు!
వా- యేమన్నావ్?
ఆ- అవును! పాతికేళ్ళు పైబడ్డా తండ్రిచాటు పిల్లాడుగా వున్నట్లు నటించే మీవంటి వాళ్ళమాట విని పెళ్ళి చేసుకుంటేమాత్రిం సుఖపడేదేముంది? మీకు కావలసింది కట్నం! నీతి అవినీతి అక్కర్లేదు! దానికోసం యెలాంటి దారుణాలకైనా తలవంచుతారు! యెటువంటి పచ్చి అబద్ధాలు చెప్పటానికైనా వెనుదీయరు! (స్థాయిపెంచి కోపంతో) అయిదువేలమీదుండే ఆపేక్షకొద్దీ నమ్మకంగా నామెళ్ళో తాళికట్టి తర్వాత మరో అయిదువేలు ఆర్జించాలనే అభిలాషతో నాకీభార్య అఖ్ఖర్లేదంటే నేనేంకాను?

వా- (వచ్చేకోపం తగ్గించుకొని) నాకూ 'నీతి' అనేదుంది!

ఆ- లాభం? అవసరమైతే మీ నీతి, మీలోవున్న మతిని, మీ నాన్న కిర్రుచెప్పుల కాళ్ళక్రింద పెట్టటానికైనా సిద్ధపడతారు!

వా- (పెద్దగా) ఆశా!

ఆ- వ్యక్తిత్వంలేని తమలాంటి వెర్రిబాగులవాణ్ణి చేసుకునే కంటే యే హిందీయో చదివి పదిమంది పిల్లలకి ప్రయివేటు చెప్పుకుంటే సుఖంగా పొట్టగడుస్తుంది! యీనిర్ణయాన్ని మా నాన్నకిచెప్పి యీ వివాహాన్ని రద్దుచేయించి హాయిగా రోజులు గడిపేందుకు ప్రయత్నిస్తాను! (వాసుని యీర్ష్యగాచూసి రెండడుగులు వేస్తుంది)

వా- (ఆదుర్దాగా) ఆశా!

ఆ (ఆగి కోపంతో) మర్యాదిచ్చి మాట్లాడటం నేర్చుకోండి! నాపేరు 'ఆశ' కాదు 'ఆశాలత' దయవుంచి 'ఆశాలత గారూ' అనండి. వస్తా! (తలుపు తెర్చుకొని గబగబా బయటకి వెడుతుంది. వాసు అటూయిటూ చూసి లోపలవైపు తలుపు తెరిచి ఆలోచిస్తూ కుర్చీలో కూలబడతాడు మరిరెండు నిముషాలకుమీదరగ్గేసుకొని ఆవలిస్తూ నిద్దరమత్తుతో లోపలనుంచివస్తాడు వెంకటేశం.)

వెంక- యేం కొంపరా బాబూ యిది! కన్నుమూత పడటం లేదు! దోమలు కుట్టి చంపేస్తున్నాయనుకో! బయటరుగుమీద నన్నా పడుకుందామని పోతున్నాను! (రెండడుగులేసి వాసుని చూసి ఆశ్చర్యంగా) అయితే నిద్ర

పోలేదా నువ్వు? (సిగరెట్టు ముట్టించి) వోరి నీమొంప తెగ! మధ్య నీకుదిగులు పట్టిందల్లేవుందేంరా?(నిట్టూర్చి) భయపడకురా బాబూ! పెళ్ళి తప్పకుండా చేస్తారు! (నవ్వి) యింక మనసు......

వా- (నోసల్లు చిట్లించి) బాగుళ్ళేదురా!

వెం- శుభం! (చిన్నగానవ్వి) యెలా బాగుంటుంది? నీమనస్సు బాగున్నా లేక పోయినా మామయ్య మనస్సు మాత్రం మహదానందంలో మునిగితేల్తోంది! (గోపలకు చూపిస్తూ) అటుచూడు! దోమకాటు బాధన్నా లేకుండా యెంత నిశ్చింతగా నిద్రపోతు న్నాడో!

వా- అదికాదు బావా! (లేస్తాడు)

వెం- ఏదికాదు?

వా- ఆపిల్ల వచ్చెళ్ళింది!

వెం- ఏపిల్ల?

వా- ఆశాలత —

వెం- (తెల్లబోయి) ఆశాలత! (ఆశ్చర్యంగా) పెళ్ళికూతురా?

వా- ఉఁ!

వెం- (హేళనగా) యేడ్చేవ్! (బయటకు వెళ్ళబోతాడు)

వా- (రెక్కపట్టుకొని) నిజంగా నేరా!

వెం- ఆ! (పరిశీలించి) యెప్పుడు?

వా- యింతకు ముందే!

వెం- చిత్రంగావుందే! కొంపతీసి కలకాదుకదా!

వా– ప్చ్! కలా గాదు గిలా కాదు! ఆ రేప్పవాల్చానో లేదో, యెప్పుడొచ్చిందో యేమో చటుక్కున కాళ్ళట్టుకుంది.

వెం– (ఆదుర్దాగా) నువ్వేమన్నావ్!

వా– అస్వతంత్రుణ్ణన్నాను!

వెం– ఏడవలేకపోయావ్!

వా– అంతకంటే యేంచేశేది!

వెం– పెద్దవాళ్ళకి బుద్ధివచ్చేలాగు చేయాలి!

వా– (వెంకటేశాన్ని చూస్తాడు)

వెం– అవున్నా! గుట్టు చప్పుడులేకుండా మీరిద్దరూ పరారయితే యెంత బాగుండేది?

వా– సమయానికి...

వెం– సాహసించలేకపోయావ్! అవునా?

వా– ఆ ఆలోచనే తట్టలేదు!

వెం– మట్టిబుర్రయితేసరి! గుట్టుగా ఆపనిచేస్తే యెంత బాగుండేది!

వా– తప్పని తటపటాయించేను!

వెం– ఆ మాట తర్వాత! హాయిగా యే తిరుపతికొండ మీదకో తీసుకెళ్ళి తాలికడితె తీరిపోయేది!

వా– పెద్దవాళ్ళు...

వెం– యెద్దుల్లా వున్నారు! లాభం? దేముడుకంటే పెద్దవాళ్ళెవరు? (నీరసంగా) అవకాశం జారిపోయాక యేమనుకుంటే యేంలాభం లే! యెందునా కాకుండా చేశేవ్!.. యింతకీ యేంజరిగింది?

వా- ఆ పిల్ల నన్ను చేసుకోనని ఖచ్చితంగా చెప్పింది!

వెం- (హేళనగా) చెప్పదు మరి మన తెలివితేటలీవిధంగా వుంటే!...ఊఁ! యింకేం! చవటలాగా యీ సంగతి మీ నాన్నకి చెప్పు!

పర- (బయటనుంచి వస్తూనే) అబ్బాబ్బ్! పురుషోత్త్రం గారు లేరూ!

వెం- (పరమేశాన్ని చూసి) ఓ! మీరా?

పర- యింతకీ వున్నారా లేరా?

వెం- లేకపోవటమేంఖర్మ! (లోపలకు చూపిస్తూ) అడేం! కుర్చీలోపడుకొని నిశ్చింతగా నిద్రపోతుంటేను!

పర- (వాసుతో) తొందరగా లేపు నాయనా మీ నాన్నని-

వా- (లోపలకి వెళ్ళబోతాడు)

వెం- (వాసు చెయిపట్టుకొని) నువ్వుండరా! (వాసునిలుస్తాడు) పరమేశంగారూ! మరేం ఫరవాలేదు! ఆయనగారితో చెప్పదల్చుకున్న రాచకార్యమేమిటో మాతో చెప్పండి!

పర- యిందులో రాచకార్యమేముంది? (నవ్వి) యేమీలేదు! పెళ్ళివారింటికి బయల్దేరే యేర్పాటులో వుండమని చెప్పాలి!

వా- (ఆశగా పరమేశాన్ని చూస్తాడు)

వెం- మేము చెప్తాంగాని, మరి...

పర- తెల్సుతెల్సు! (నవ్వి) మీ సందేహం నాకు తెల్సు! అయిదువేలు, యితర లాంచనాలు తాలూకు వెయ్యి వెరసి ఆరు వేలూ సిద్ధంచేశే......

వేం- (వెటకారంగా) తమరొచ్చారు!

పర- (గుటకలు మింగుతూ తెల్లబోయి చూస్తాడు)

వా- (పట్టరాని ఆనందంతో కుర్చీలో కూర్చొని ఆలో చిస్తు చిరునవ్వుతో చూస్తుంటాడు)

వెం- అమ్మయ్య! మధ్యన నేను బ్రతికేను! కాకపోతే మర్నాటినుంచి ఈ తండ్రీ కొడుకుల ధర్మమాంటూను తమ దయాంటూను, [విచారంగా] ఆయన చేతికి చిప్ప వస్తుందేమో కాని-

పర- [వుక్రోషాన్ని తిరిగి సంతోషంగామార్చి] అహహా! మనము తా వుండగా అంతదాకా రానిస్తామా? [నవ్వి మాట తడబడుతూ] అవతల పనుంది. నే వెళ్ళాలి! వారితో చెప్తారుగా!

వెం- (హేళనగా) చిత్తం!

ప- (వెంకటేశాన్ని చూస్తూ గుటకలు మింగుతూ బయ టకు వెడతాడు)

వెం- (పరమేశం వెళ్ళిన మార్గాన్ని చూసి నిరుత్సాహంతో) పాపం! (తిరిగి వాసుని చూస్తాడు వాసు రెప్పవాల్చకుండా చూస్తుంటాడు) వాసూ!

వా- (మాట్లాడడు కదలికలేదు)

వెం- (నీరసంగా) అయింది! (గబగబా లోపలకెళ్ళి గ్లాసుతో నీళ్ళు తెచ్చి) యివిగో! (ఆదుర్దాగా భుజం పట్టుకు వూపుతూ) యీ నీళ్ళు (నోటిదగ్గర పెడ్తాడు)

వా- (తేరుకొని గ్లాసుని చూసి, తర్వాత వెంకటేశాన్ని చూస్తూ నోసళ్ళు ముడేసి) యెందుకు?

వెం- త్రాగడానికి —

వా- యెవరిమ్మన్నారు?

వెం- నీవాలకం!... రెండుగుటకలు వేస్తే కొంచెం ప్రాణం తేరుకుంటుంది!

వా- థాంక్సు! (గ్లాసు అందుకొని ప్రక్కనపెట్టి హేళనగా) యింక తమరు 'దయచేయండి!

వెం- (నిరసంగా) చిత్రం! (బయటకు చూస్తూ రెండడుగులేసి) భజంత్రీలూ! (చప్పట్లుకొట్టి) ఓజంత్రీలూ! పెళ్ళి వారింటి కెళ్ళాలి! యింతవరకూ మా మేళాం అయింది. యింక మీ మేళాం మొదలుపెట్టండి! ఊఁ! యెంత బాగా వాయిస్తే అంత డబ్బు! (నవ్వి) అప్పుడే అయిందీ! అవవలసిం దంతా ముందేవుంది! ఊఁ! వాయించండి!

వా- (విరగబడి నవ్వుతాడు)

వెం- (వాసునిమూస్తూ) సిగ్గులేకపోతేసరి (అంటూ రంగం ప్రథమంలో పాడిన రికార్డు చరణం అందుకొని పాడుతూ గబగబా లోపల కెడతాడు. భజంత్రీలు మేళం వాయిస్తుంటారు. వాసు చిరునవ్వుతో తిరిగి అద్దంలో చూస్తూ తలదువ్వుకుంటూంటాడు)

( తెర )



# పెళ్ళి

## రెండవ రంగము

(పెళ్ళి మండపం దగ్గర! అప్పుడు టైమ్ రాత్రి 2-30 గంటల ప్రాంతం. అరిటాకులతో మామిడాకులతో అలంకరించబడిన మండపం యెదురుగా కనిపిస్తుంటుంది. దాసు మామిడాకుల తోరణాలు కడుతూంటాడు. తెర నెమ్మదిగా ప్రక్కకి తొలుగుతుంది. ఆశ విచారంతో లోపల నుంచి వస్తుంది)

ఆశ- (మండపాన్ని వొక్కసారి పరిశీలించి) అన్నాయ్!

దా- (తోరణాలు కడుతూనే) యేంకావాలి చెల్లాయ్?

ఆ- నాన్నింకా రాలేదూ?

దా- లేదు!

ఆ- ఎక్కడికి వెళ్ళారో తెల్సా?

దా- ఇంకెక్కడికి వెడతారు? (ఈర్ష గా) రాబోయే అల్లుడు గారి ముడుపుకోసం మూట తయారు చేయటానికని వెళ్ళుంటారు!

ఆ- (తెల్లబోయి చూస్తూ) యెందుకీ ప్రయత్నమంతా? యీ పెళ్ళి నాకిష్టంలేదు.

దా- (ఆదుర్దాగా ఆశ్చర్యంతో) చెల్లాయ్!

ఆ- అవునన్నాయ్ !

దా- (నొసళ్లు చిట్లించి) ఆలోచించే అంటున్నావా?

ఆ- అనడంలో తప్పేముంది ?

దా- ఆ చరణంలో పెట్టటం అసాధ్యమేమో!

ఆ- ప్రయత్నానికి మించిన అసాధ్యముందా?

దా- నాన్న పడుతున్న అవస్థ మాళ్లే కంటున్నావేమో?

ఆ- అదీ వొక కారణమైండచ్చు! మరో కారణంకూడా లేక పోలేదు !

దా- ఏమిటది ?

ఆ- సుంకమిచ్చి కొని తెచ్చే భర్తతో సంసారం చేయటం యిష్టంలేదు !

దా- (నవ్వి) యింతేనా? మనమేం చేస్తాం? కాలం అలా వుంది! యీడూ జోడూ, అంద చందాలూ యీ రోజుల్లో అక్కర్లేదు! మొగపిల్లవాడు పుట్టింది లగా యితూ మాటలకోసం ముందడుగేసి మాటల్లోనే గాల్లో మేడలు నిర్మిస్తున్నారు. యీ కాలంలో కూటికి లేని వాడూ కట్నానికే కలువరిస్తున్నాడు. ఆ స్త్రీవున్న వాడూ అందుకే తాపత్రయ పడుతున్నాడు! అల్లుడు రావాలంటే యీ లంచాన్ని లాంచన రూపంలో యిచ్చితీరాల! అంతేగాని, అమ్మాయిని చూసి అల్లుడొచ్చే రోజులు కావివి —

ఆ- అలా వచ్చినరోజునే పెళ్ళిచేసుకుంటాను!

దా- లేకపోతే?

ఆ- బ్రహ్మచారిణిగావుంటే వచ్చిన నష్టంలేదు!

దా- (పెద్దగా నవ్వుతాడు)

ఆ- యెందుకానవ్వు? అన్నమాటలో పొరపాటుందా? బజార్లోకొనే వస్తువులాగా యిలాంటి వాళ్ళని రొఖ్ఖం పోసి కొని అల్లుడనే హోదాయిచ్చి మెళ్ళో గుదిబండ కట్టించుకు నేకంటే, యే స్త్రీ జనాభ్యుదయశాఖలోనో కృషిచేసి మరోవిధంగా పొట్టగడటానికి మార్గం చూచుకుంటే మంచిది! యిదే నాన్నకీ చెప్పదల్చుకున్నాను.

దా- వెరీగుడ్! చాలా బాగుంది! (ఆలోచనతో) మరొక విషయం కూడా ఆలోచిస్తే మంచిది.

ఆ- ఏమిటి?

దా- ఈ నీ ప్రవర్తన చూస్తే నాన్న మనస్సుకి కష్టం కలుగుతుందేమో!

ఆ- (సన్నగానవ్వి) అప్పులపాలై తిప్పలుపడేకంటే కొద్ది కష్టంతోనే వొడ్డున పడటం మంచిదికాదూ?

దా- నిజమే చెల్లాయ్! యేమంటూ యీ పాడుసంబంధం స్థిర పర్చుకున్నామో ఆరంభంనుంచీ అన్నీ అవాంతరాలే! యితరుల మంచిమర్యాదల్ని గుర్తించక కట్నంకోసం కాళ్లుజాచుకూర్చున్న వాళ్ళకి గుణపాఠం చెప్పటం

మంచిదే కాదని యెవ్వరూ అనరు! కాని నేచెప్పేది వొక్కటే! ఆలోచించి ఆత్మ నిగ్రహం వుంటేనే యీ సంబంధం వద్దని పట్టుపట్టు' కథ అడ్డంతిప్పి ఆదర్శం కోసం పాటుపడు! నిదర్శనంగా నీ కథనే బోధించి విజయం సాధించు!

ఆ- అలా చేయాలని మనస్ఫూర్తిగా వుంది!

దా- చేతగాకపోతే యిప్పటివరకూ వచ్చిన అపఖ్యాతిని గుర్తించుకొని తటస్థంగా వూరుకో!

ఆ- నన్ను అనుమానించకు! యీ మాటల్ని పరిశుద్ధమైన ఆత్మతో, తదేకదీక్షతో ఆచరణలో పెట్టాలనే అభిలాషతోనే అంటున్నా!

దా- (తెల్లబోయి) ఆఁ! నిజంగానా!

ఆ- అనుమానిస్తున్నావా!

దా- లేదు!

ఆ- మర్చిపోకన్నాయ్! నీతినిజాయితీల కోసం పోరాడేటలో నీకేమాత్రం తీసిపోదు నీ చెల్లెలు!

దా- (పొంగిపోర్లే ఆనందంతో ఆశ బుజాలు పట్టుకొని తన వైపుకి తిప్పుకొని, కళ్ళల్లోకి చూస్తు ప్రేమగా) చెల్లాయ్!... అలాగే వుండాలి! ఆ పట్టుదలే నీలోవుండి ముందడుగేస్తే తప్పకుండా జయించి తీర్తావ్! లాంచనాలంటూ అంచనాలేసుకొని కట్నాల కోసం కన్నుమిన్ను గానక ప్రవర్తించే వాళ్ళకు చక్కని గుణ

పాఠాన్ని చెప్పిన దానవవుతావ్! ఆడపిల్లల్ని కని, పెంచి, కట్నాలివ్వలేక కుళ్ళి కృశించే మనలాంటి నిర్భాగ్యు లంతా యీనీ కథను ఆదర్శంగా తీసుకొని నీకు నీరాం జనాలర్పిస్తారు.

ఆ- (పొంగి పోర్లే ఆనందంలో) అన్నాయ్!

దా- (దగ్గిరికి తీసుకొని తల నిమురుతూ) హృదయ పూర్వ కంగా ఆశీర్వదిస్తున్నాను చెల్లాయ్! అన్నమాటేదో అన్నే అన్నావ్! నీతిని వదిలి మతిని మరోచోట కొదవబెట్టి డబ్బుకోసం గడ్డితిని గుడ్డి సిద్ధాంతాల్ని సృష్టించి, పేదకుటుంబాల్ని రచ్చకీడ్చి రాద్ధాంతాలు చేసే పురుషోత్తంలాంటి విషపుపురుగులుకి తగిన ప్రతీ కారం చేసి పాఠం చెప్పాలి! కాదన్ను, కాని... (సందేహిస్తాడు)

ఆ- సమయం కాని సమయంలో సందేహానికి స్తానంలేదు! యేమిటో చెప్పు?

వా- యేముంది? యీ ఆలోచన ముందేవుంటే యెంత బాగుండేది?

ఆ- యిప్పటికీ మించిపోయేదేమీలేదు! నువ్వు నాకు అండగా వుంటేచాలు! యెలాంటి విపరీత సంఘటన కైనా యిట్టె, సునాయాసంగా సాధించగలను! దానికి నాంది ప్రస్తావనగా...

దా- పెళ్ళిళ్ళనే వంకతో పేద సంసారాల్ని స్మశానాలుగా మార్చే పరమేశం వారిచే ఆ పురుషోత్తంకి కబురు చేద్దామా?

ఆ- (ఆలోచనగా) యేమని?

దా- తనలాంటి పరమలుబ్ధాగ్రేసర పాతక చక్రవర్తితో పొత్తు కుదరదని —

ఆ- అవునన్నాయ్! అలా చేస్తే చాలా బాగుంటుంది!

పరమేశం- (బయటనుంచి వస్తూనే) అబ్బాయ్ దాసూ

ఆ- సమయానికి దేముళ్ళాగ మీరు మీరే వచ్చేరు! (దాసుతో) అన్నాయ్! ఆలశ్యం దేనికి వెళ్ళి చెప్పి రమ్మను!

ప- (నవ్వి) దానికేం! తప్పకుండా చెప్పొస్తాను! (నవ్వి) యేమిటీ? యెవరితో చెప్పిరావాలీ? ...ఊ! చెప్పండి!

ఆ- పురుషోత్తంగారితో!

ప- (నొసళ్ళు ముడేసి) యేమని?

దా- వారి సంబంధం రద్దు అని —

ప- (వులిక్కిపడి) యేమన్నారూ? (ఆలోచించి మళ్ళీ తేరుకొని మందలింపుగా) "శుభం పలకరా వెంకన్నాంటే పెళ్ళికూతురు ముండేదన్నట్లు" యేం మాటలు దాసూ అవి?

దా- తమ దయాంటూ యీ సంబంధం కుదిర్చారు!

ప- కుదిరిస్తే?

ఆ- ఏమంటూ కుదిర్చారో ఆ రోజునుంచి మా యింట్లో యే వొక్కళ్ళకూ మనస్థిమితంలేదు!

పర- (తెల్లబోయి) ఆఁ!

దా- [హేళనగా] మహానుభావులు యిదంతా తమచలువే!

పర- (గుటకలు మ్రింగుతూ) చాల్చాల్లే! వూరుకోండి! యెవరన్నా వింటే నిజమేననుకుంటారు కూడా!

దా- ఆ సత్యమైతేగా ఆ భయం!

పర- దాసూ! యెప్పుడూ హేళనేనా!

దా- (యీర్ష్యగా) వేళకాని వేళల్లో హేళనతో పనిలేదు యిది నగ్నసత్యం!

పర- ఆఁ! (కోపంతో) యేమన్నావ్? మీగురించి యెంత శ్రమపడ్డానో అప్పుడే మర్చిపోయారూ? యీమాటలు మీగనాల్సినవేనా?

దా- మర్యాదస్థులం కనుక మాటల్తో సందలించి వూరుకున్నాం! మరొకడైతే నీ అత్యాచారాలకు చేయాల్సిన పరాభవంచేసి మరి పంపేవాడు!

ఆ- సంబంధాలనే వంకతో యెన్నో సంసారాల్ని స్మశానాలుగా మార్చే మీరు, పెళ్ళిళ్ళనే వంకతో యెందరి ప్రాణాల్నో పొట్టనపెట్టుకునే మీరు చేస్తున్నపని సక్రమమైంది కాదని యెలాగుందో వొక్కసారి చూడండి! గ్రహించండి! యీ రోజులలో ఆడపిల్లల గతి

పర- చూస్తున్నాం కనుకనే పెళ్ళిళ్ళు చేస్తున్నాం! 'వెయ్యి అబద్ధాలాడన్నా వొక పెళ్ళి చేయాలన్నారు' పెద్దలు!

దా- మీరు చేస్తున్నారు! తట్టుకోలేక ప్రజలు చస్తున్నారు!

పర- (మాట తడబడుతూ వుక్రోషంగా) చూస్తున్నా వామ్మాయ్ మీ అన్నయ్యమాటలు?

ఆ- వింటున్నాను! మీ ఘోరాలు కళ్ళరా చూస్తున్నాను!

పర- (కోపంగా) సంతోషించాంలే !

దా- (సంతోషించకేంచేస్తారు) యీ రోజులలో ఆడపిల్లల పెళ్ళంటే సుఖంలేదు! యీడుజోడు, దాంపత్య మంచి చెడ్డలు, వంశ మర్యాదలు, యెంచేవాళ్ళు యెవ్వరూ లేరు! యే యిట్లో చూసినా యేవొక్కళ్ళని పలుక రించినా వేలుసంపాదించాలనే వెర్రి ఆపేక్షతప్ప మరే మన్నా వుందా? కట్నం పెట్టకలుగుతే కుర్రాడు కుదురుతాడు! ఆ తాహత లేని వాళ్ళేం చేస్తున్నారో వూహించారా? యే తాతయ్యో చేతనో తాళికట్టించి తన బాధ్యత తీర్చుకుంటున్నాడు! యిది జగిగే ఘోరం! కాదని మీరు అనగలరా!

పర- (దిక్కులుచూస్తూ, గుటకలు మ్రింగుతూ చిన్నగా) చచ్చాం!

దా- వున్న సంగతి బయటపెట్టాననా?

పర- (దాసుని, ఆగని మొగాదిగా చూసి) వొక చెంపకొడితే నెత్తురు, మరొక చంపకొడితే పాలుకారే కుర్రిలు! మీతో నాకేంపని (వెళ్ళబోతాడు)

ఆ- పరమేశంగారూ!

పర- (ఆగి, తనలో) రాబడికి లోబడి యీ సంబంధాన్ని కుదిర్చాంమనం! పీకల్లోహంగామని పట్టిచూస్తే నోట్లో దుమ్ముకొట్టిట్టున్నారే! (తెల్లబోయి ఆశని చూస్తాడు)

ఆ- మరోమాట..

పర- యివ్వాల్సిన సొమ్ము యింకా మిగులున్నాయా?

దా- వున్నా మీకొచ్చిన తంటాలేదు! మీరు సంబంధాలు కుదిర్చేది మావంటి వాళ్ళమీద దయవుండిగాదుగా! యీ వంకతో జేబులు నింపుగోటం మీకు బాగా అలవాటయింది! యీదులోని యదార్ధాన్ని అపార్ధం చేసుగోకుండావుంటే మీకే తెలుస్తుంది! యిలాంటి సంఘటల్ని మీ నిత్య జీవితంలో యెన్నో చూస్తూం టారు!

ప- (కోపంగా చూస్తూ) అయిందా యింకేమన్నా వున్నాయా?

దా- వున్నా వుండకపోయినా యీ పెళ్ళి ఆపుచేయ బడిందని ముందా పురుషోత్తంతో చెప్పిరండి!

ప- (తెల్లబోయి) ఆఁ!

ఆ- మధ్య మీకు బాదెందుకు? వెళ్ళండి

ప- (స్థాయి తగ్గించి మాటతడబడుతూ) కాదమ్మామ్!
ఆ- అయినా కాకపోయినా యీ ప్రకారం జరిగితీరాల్సిందే! యీమాటే ఖాయమా?
దా- మెన్నోసార్లు చెప్పనవసరంలేదు!
ప- యిది మీకేమన్నా బాగుందీ?
ఆ- తప్పొప్పులు తర్వాత చర్చించుకుందాం! ముందీసంగతి నాళ్ళకి తెలియచేయండి!
ప- (నీరసంగా నిట్టూర్చి) సరే! నాదేముంది? మీ ఇష్టం! మధ్య నాకెందుకు చెప్పమన్నమాటేదో చెప్తాను! యేదన్నా వస్తే...
దా- చూసుకోటానికి మేము సిద్ధంగానే వున్నాం!
ప- (మరోసారి దాసుని యెగాదిగాచూసి బయటకివెళ్ళ బోయి ఆగి) అనుకున్నంతా అయింది! (నీరసంగా) యింతకీ యిందులో మనకి లాభం శూన్యం! (బాగా నీరసంగా) పెట్టారు మనకి పంగనామాలు (ఆలోచించి పైకి) అన్నట్లు మీ నాన్నగారిమాట లేకుండా చెప్తే యేమన్నా అంటారేమో!
సీతయ్య- (బయటనుంచి వస్తాడు)
దా- యేమీ అనరు!
సీ- (లోపలకు వెళ్ళేవాడు ఆగి) ఏవిషయంలో?
దా- చెల్లాయి పెళ్ళి విషయంలో!
సీ- (ఆదుర్దాగా) మళ్లీ యేమొచ్చింది?

ప– రద్దయినట్లు చెప్పిరమ్మన్నారు?
సీ– (తెల్లబోయి) ఆఁ! యేమన్నారు? పైకం సిద్ధంచేశే నుగా! (పరమేశంతో) యింతలో అంత తొందరపడి రద్దుచేయాల్సినవసరమే మొచ్చింది?
దా– వచ్చింది కాబట్టే!
సీ– నువ్వు ఖబురుచేస్తున్నావా?
ఆ– అవును నాన్నా!
సీ– (శూన్యంగా) ఆశా!
ఆ– నామాటకు యెదురు చెప్పకండి నాన్నా!
సీ! (ఆలోచించి, వెంటనే తేరుకొని నొసళ్ళు చిట్లించి ఆశా దాసుల్ని చూసి పరమేశంతో) పరమేశంగారూ! పై విషయాలన్నీ నే సర్దుబాటు చేసుకుంటాను! మీరు ముహూర్తసన్నాహాలు చేయించి వాళ్లని ప్రయాణం చేయి చండి!
దా– (స్థాయిగా) నాన్నా!
సీ— (మందలింపుగా) దాసూ!
ప– (చిన్నగా నవ్వి) కుర్రతనం! యింకా యేమీ తెలియదు! కోప్పడకండి సీతయ్యగారూ!
సీ– (పరమేశాన్ని చూసి కోపం తగ్గించుకున్నట్లుగా) ఊఁ!
ప– నే వెళ్ళొస్తానుమరి – (సీతయ్య సరే! నన్నట్లు తలూపుతాడు. పరమేశం పైకండువా సవరించుకుంటూ బయటకు వెడతాడు)

సీ– (పరమేశం వెళ్ళిన మార్గాన్ని చూస్తూ) తొందరగా రండి పరమేశంగారూ !

ప– (బయటనుంచి పెద్దగా) ఆ! ఆ! అలాగే!

సీ– [వాసుని ఆశని చూసి నీరసంగా నిట్టూర్చి లోపలకి వెళ్ళబోతాడు)

దా– (ఆదుర్దాగా ఆశని చూస్తాడు. 'చెప్పమన్నట్లు' సవిగ చేస్తాడు)

ఆ– (దాసుని చూసి సీతయ్యతో) నాన్నా !

సీ– (ఆగి) యేమ్మా! (నెమ్మదిగా సమీపిస్తు) నువ్వెందుకు పిల్చావో నాకు తెల్సును !

దా– (లోపలకు వెళ్ళబోతాడు)

సీ– (వెళ్ళబోయే వాసుని చూస్తూ) దాసూ ! (సమీపిస్తు) యేళ్ళపై బడగానే సరికాదు !

దా– (ఆగుతాడు)

సీ– పసివాడైతే పదిసార్లు చెప్పవచ్చు ! ఆలోచనలేకుండా వ్యవహరించకు ! యిది నీ చెల్లెలు పెళ్ళనిమాత్రం గుర్తుంచుకో ! దాన్ని పురికొల్పి నువ్వూరుకోటం గాదు! దాని నెత్తిద ఆ నాల్గు అక్షింతలూ పడకుండా దాని బ్రతుకు బజారుపాలు చేయటం నీకు అనుకున్నంత మంచిదికాదు ! (దాసు లోపలికి వెడతాడు) యెందుకురా యేళ్ళరాగానేసరా ?

ఆ– వద్దని చెప్పింది నేనే!

సీ- నీకు తెలియక నువ్వు చెప్పచ్చు!

ఆ- సర్వం తెల్సుకునే చెప్పేను!

సీ- అంటే?

ఆ- మీ మాటకు యెప్పుడు యే విషయంలోనూ యెదురు చెప్పలేదు!

సీ- ఏమిటమ్మాయ్ నీ ధోరణి?

ఆ- రొక్కంపోసికొనే భర్త నాకు అవసరంలేదు!

సీ- పొరబడుతున్నావ్!

ఆ- పొరపాటే జరిగింది! అందుకే యింతవరకూ యిందు లోని సత్యాన్ని గ్రహించలేకపోయాను!

సీ- కాలం అలావుంది తల్లీ! (దాసు లోపలనుంచి వస్తాడు) పేదవాడైనా భాగ్యవంతుడైనా దాన్ని అనుసరించి తీరాలి!

దా- అనుసరణనేమాటను ఆయుధంగా తీసుకొనిఅనవసరంగా అవస్థలు పడుతున్నాం! సిరిసంపదలు లేకపోయినా చెల్లాయికి భగవంతుడిచ్చిన ఛక్కదనముంది!

సీ- ఉంటే!

దా- కావాలనికోరి గడపలోకి యెవరైతే వస్తారో వాళ్ళనే చేసుకుంటే మంచిది!

సీ- వాడు యెటువంటివాడైనా సరేనా?

ధా— యింతకింటే పరువుతక్కువ సంబంధం మాత్రింరాదు!

సీ— వంశ మర్యాదలు గౌరవ ప్రవృత్తులతో పనిలేని నేగా ని వుద్దేశం?

దా— నా-వుద్దేశమేదైనా దాని వుద్దేశంకూడా యిష్టంలేనట్లే కనబరుస్తోంది!

సీ— (ఆశని చూస్తాడు)

ఆ— (సీతయ్యని చూసి యేదో చెప్పబోతుంది)

సీ— (ఆశా దాసుల్ని చూస్తూ) బాగానేవుంది! అయితే యిద్దరూ కూడాపలుక్కున్నాగన్నమాట-

ఆ— నాన్నా! యిప్పట్లో పెళ్ళికాకపోయినా పరవాలేదు! బ్రతకటానికి... ...

సీ— ఆశా! (మందలింపుగా) నువ్వేం చెప్పద్దు! బ్రతకటానికి అనేక మార్గాలున్నాయ్! కాదన్ను! అవి యెంత మంచివైనా, ఆడదానికిగాని, మగవాడికిగాని, పెళ్ళని సంసారమని యేర్పాటు చేయటం చాలా అవసరం! (దగ్గరకు తీసుకొని తల నిమురుతూ) నామాట కాదని నిరాకరించకుతల్లీ!

ధా— (సీతయ్యని చూస్తూ యీర్ష్యగా) మనలో యింతలోకు వుండబట్టే ఆ పురుషోత్తం నెత్తినెక్కి పిండికొడు తున్నాడు. నాకెందుకులే! (గబగబా లోపల కెళ్ళ బోతాడు)

సీ— [నవ్వి] యేంమాటలురావి? అన్నిటా తొందరపడటం మంచిదికాదు!... ఈడొచ్చిన పిల్లని యింట్లో పెట్టుకుంటే, యెక్కిరించటానికి యెవరైనా ముందుకి వస్తారు!... యెన్నో అపవాదులకి గురికావలసివస్తుంది సంఘంలో చెలరేగిన అపోహల్ని చూస్తూ ఆహ్వానించే కన్నా ఆచారం ప్రకారం ఆడపిల్ల వివాహం చేయటం మంచిదికాదా దాసూ!

దా— (సీతయ్యనిచూసి గబగబ లోపలకు వెడతాడు)

ఆ— కాదని అన్నామా? (లోపలకు వెళ్ళే దాసునిచూస్తూ) ప్రస్తుతానికి యీ సంబంధం మాత్రం రద్దుచేయమంటున్నాం!

సీ— (చిన్నగా నవ్వి) పిచ్చితల్లీ! అసలుజరపటం అనుకున్నంత తేలిక కాదమ్మా! అర్థం శుభం యెరుగని అమాయకురాలివి! నీమనస్సు నాకు తెలుసునమ్మా! నా అవస్థ కళ్ళారా చూళ్ళేక ఆవేశపడి అన్నావే కాని, అందువల్ల వచ్చేఫలవంపులు గ్రహించలేక పోతున్నావ్!

ఆ— అర్థంకాని ఆవేదనతో అనుకునే మాటలు నాన్నా అవి —

సీ— పొరబడుతున్నావ్ తల్లీ!

ఆ— నిజమే! నేను గుడ్డిదాన్ని కాదు. కుంటిదాన్ని కాదు! ఆకారం వికారంగానూ లేదు. నాలో యేం లోటుందని అంత కష్టం పోయాలి?

సీ— లోటు కాదమ్మా! బ్రహ్మ గీసిన గీటు! దాన్ని తప్పించుకోటం మానవమాత్రులమైన మనలాంటి వాళ్ళకు అసాధ్యమైనపని —

ఆ— ఈ వెర్రి వేదాంతాలకు తలవంచుతున్నాం కాబట్టే యిలావుంది! యింతకంటే ...

సీ— (విచారంగా) విన్నేను! యింకేమీ చెప్పద్దు తల్లీ! నా బాధ నీకు తెలియదు! నాకు కావలసింది నీసుఖం! యీ బొందిలో వూపిరున్నంతవరకు నేను కోరేదదే! అందుకే యీ సంబంధం కోసం యెదురు చూశేను.

ఆ— (తెల్లబోయి చూస్తూ విచారంగా) నాన్నా!

సీ— అవునమ్మా! యీడూ జోడూ వుంది! తరగనితిండి! చిరగనిగుడ్డ! కుర్రవాడు చిన్నవాడు! బుద్ధిమంతుడు! బి. ఏ. చదివేడు. (విచారాన్ని ఆనందంగా మార్చుకుంటూ) నీకే కొంతా లేదు! నే కావాలని కోరింది కూడా యిదే!

ఆ— (ఆదుర్దాగా) నాన్నా!

సీ— పురుషోత్తంగారు మొదట్లో వొప్పుగోకపోతే యెంతో కంగారుపడ్డాను! చక్కటి సంబంధాన్ని చేతులారా వొదులుకోవాల్సి వస్తుందని కాలుకాలిన పిల్లిలా

తిరిగేను! ఆఖరికి యెన్నో అగచాట్లుపడి కట్నం మూట తెచ్చేసరికి తల్లిప్రాణం తోక కొచ్చింది!... యిప్పుడీవిధంగా మీరిద్దరూ పోట్లాడుకుంటే జీవితాంతం వరకూ నలుగుర్లో తలెత్తుకు తిరగ్గలనా?

ఆ— (దీనంగా) మీ అధికారొచ్చారానాన్నా!

సీ— లేదమ్మా!

ఆ— (సందేహంగా నొసళ్లు ముడేసి) మరి పైకం యెక్కడిది?

సీ— యెక్కడిదైతేనేం? (సందేహంతో) అప్పు తెచ్చానమ్మా!

ఆ మళ్లీ తీర్చలేక తిప్పలు పడద్దూ?

సీ— ఫరవాలేదమ్మా! నీకోసం, నీ జీవిత భవిష్యత్తుకోసం, యేం చేయటానికైనా వెనుదీయను తల్లీ! (విచారంతో) చిన్నప్పుడే తల్లిపోతే మీ యిద్దర్నీ కడుపులో పెట్టుకు పెంచాను! భగవంతుని దయాంటూ పెరిగి పెద్దవాళ్ళయ్యారు! దాసు విషయంలో నాకు భయంలేదు, వాడికి చదువుచెప్పించాను! భగవంతుడిచ్చిన తెలివితేటల్ని సద్వినియోగపర్చుకుంటే వాడి పొట్టవాడు పోసుకోగలడు! యింకా నీసంగతంటావా? ఆడపిల్లవి! ఆడపిల్లనియేదో యేర్పాటు చేయకపోతే యెలా బ్రతుకుతావ్?

ఆ— (దీనంగా సీతయ్యని వొక్కసారి చూస్తుంది)

సీ— నా పరిస్థితి నీకూ తెల్సు! పెద్దవాణ్ణయ్యాను! కాడి రమ్మంటోంది, వూరు పొమ్మంటోంది! నీకేదో దారి చూపిస్తే... (చెప్పలేక పైకండువాతో కన్నీరుతుడ్చుకుంటాడు)

ఆ— (విచారంతో) యేడవకు నాన్నా!

సీ— లేదమ్మా! (తేరుకొని సంతోషంతో) చూడమ్మా! వేళవుతోంది! ముహూర్తానికి సిద్ధంకామ్మా!

ఆ— మమ్మల్ని అర్థం చేసుకోలేక పోతున్నారు! మీకాళ్ళు పట్టుకుంటాను! (గభాలున కాళ్ళు పట్టుకొని) యెలాగయినా యీ సంబంధం రద్దు చేయించు నాన్నా!

సీ— (నిట్టూర్చి) మళ్ళీ మొదటికొచ్చావామ్మా? (లేవదీసి) సరే! (ఆలోచించి) యెవరికర్మలో యేం రాశుందో యెవరు చెప్పగలరు?... యిదే మీరు కోరేదయితే, అన్నా చెల్లెలు యేకమై మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి! (గబగబా బయటకు వెళ్ళబోతాడు)

ఆ— (చెయిపట్టుకొని) యెక్కడికి నాన్నా?

సీ— సుఖదుఃఖాలులేని చోటుకి—

ఆ— ఆఁ! (ఆలోచించి దారికి అడ్డునిలబడి) వెళ్ళటానికి వీల్లేదు!

సీ— శాసించటానికి నీకు హక్కులేదు! (వెళ్ళబోతాడు)

ఆ— (స్థాయిపెంచి) వుండండి నాన్నా!

సీ— (ఆగుతాడు)

ఆ- మీరు వెళ్ళడంలోగల అంతరార్థం గ్రహించాను! మిమ్మల్ని వ్యతిరేకించాలనే అభిప్రాయంతో మేమీ నిశ్చయానికి రాలేదు' సంఘమనే పేరుతో తెరమరుగున జరిగే ఘోరాల్ని అణచాలనే ఆసక్తికొద్దీ అన్నాం!... యేంలాభం? తానొకటి తలుస్తే దైవ మొకటి తల్చింది! నిజాన్ని గ్రహించలేక కన్నబిడ్డల్నే అనుమానించారు! దాన్ని మీ అవమానంగా యెంచారు!...మమ్మల్ని క్షమించండి! మీ యిష్ట ప్రకారమే కానియ్యండి!

సీ- (పట్టరాని సంతోషంతో) అమ్మా! (కౌగలించుకుంటాడు)

ఆ- (వచ్చే యేడుపుని పమిటచంగుని నోటికి అడ్డుగా పెట్టుకొని ఆపుకుంటుంది)

సీ- యింట్లో కెళ్ళమ్మా! పెళ్ళివారి కోసం వెళ్ళిరావాలి!

దా- (లోపలనుంచి వస్తాడు)

నా- దాసూ! విడిదికి వెళ్ళి పెళ్ళివార్ని బయల్దేర తీసిరా నాయనా!

దా- (యీర్ష్యగా సీతయ్యని చూస్తూ నొసల్లు చిట్లించి) నాకు తెలియదు!

ఆ- వెళ్ళిరాన్నాయ్!

దా- ఈ ఘోరానికి నువ్వూ అంగీకరించావా?

ఆ- పరిస్థితులు అలావచ్చాయ్!

దా- ముందుస్థితిని అర్థ చేసుకున్నావా?

సీ- (నవ్వి) దానికే!

దా- మీకు కావలసింది మాటనెరవేరటం! తర్వాత దాని భవిష్యత్తు యెలావుంటే మీకెందుకు?

సీ- అదే నిలోవున్న తెలివితక్కువ! దానికేం! సిరిసంపదలతో కళకళ్ళాడుతూ బంగారంలాగుంటుందని నీకు తెలియదు!

దా- (విసుగ్గా) యీ వేదాంతమే...

ఆ- (మందలింపుగా) అన్నాయ్! (సీతయ్యతో నెమ్మదిగా) వాడికొందరు నీకు తెలియదా నాన్నా!

సీ- తెలుసునమ్మా తెల్సు! నా మాటంటే వాడికి గౌరవం లేదని బాగా తెల్సును!

దా- (రోషంతో) నే పట్టిన కుందేటికి మూడేకాళ్ళంటే యెలావుంటుంది?

ఆ- (దాసుని సమీపించి) నా మాటవిని వెళ్ళిరాన్నాయ్!

సీ- వద్దు! నేనే వెడతాను! వాడికి తప్పిందని నాకు తప్పుతుందా? (ఆశ దాసుల్ని చూసి బయటకు వెళ్ళబోతాడు)

దా- (వెళ్ళె సీతయ్యనిచూసి, మళ్ళీ ఆశనుచూసి సీతయ్యతో) నేనే వెడుతున్నాను! (సీతయ్యఆగి దాసుని చూస్తాడు. దాసు ఆగి గబగబా బయటకు వెళ్ళబోతాడు. పరమేశం గబగబా బయటనుంచి వస్తాడు. దాసు ఆగి

ప్రక్కగా పరమేశాన్ని చూస్తు అతని మాటలు వింటూంటాడు.)

పర- (ఆపుర్దాగా) యింకా యిలా నే వున్నా రేం? పెళ్ళివారు వచ్చేస్తున్నారు కల్యాణమంటపానికి- (ఆశలోపలకు వెడుతుంది)

సీ- అలాగా? (దాసుతో) దాసూ! అమ్మాయిని సిద్ధం చెయినాన్నా!

దా- (సీతయ్యని పరమేశాన్ని చూస్తు లోపలకెడతాడు)

ప- (దాసు నెళ్ళాక అటూ యిటూ చూసి) మరో సంగతి! వాళ్ళకు యివ్వాల్సిన అయిదు వేలు. లాంచ నాలు తాలూకు వెయ్యి వెరసి ఆరువేలూ వాళ్ళు మీ గడపలో కాలుపెట్టిన మరుక్షణం యివ్వాలని నిర్మాహమాటంగా చెప్పమన్నారు పురుషోత్తంగారు!

సీ- యెప్పుడైనా యివ్వాల్సిందేగా! అంత అనుమానంగా వుంటే యిప్పుడే తీసుకెళ్ళి యివ్వండి!

ప- అహహ! అదేమిటి సీతయ్యగారూ అలాంటారు? యిది మర్యాద కాదు! వాళ్ళు మీ యింటికి రాగానే వాళ్ళకేయివ్వటం మర్యాద! (అటూ యిటూ చూసి నెమ్మదిగా) పోతే నాతాలూకు బహుమాన మంటారా ముహూర్తం కాగానే ముట్టచెబుదురుగాని —

సీ- (నిట్టూర్చి) ఉ! లోపలకు నెడతాడు. పరమేశం నవ్వుతూ బయటకు వెడతాడు బయటనుంచి సన్నాయి

మేళం కొద్దిగా వినిపిస్తుంది! అది క్రమేపీ దగ్గరగా వినిపిస్తుంది. సీతయ్య ఇంట్లోనుంచి బయటకు వస్తాడు. బయటనుంచి పురుషోత్తం, వాసు, వెంకటేశం, మరిద్దరు పెళ్ళి పెద్దలు, పరమేశం, వస్తారు] రండి రండి! [అక్కడ పరిచున్న చాపల్ని చూస్తూ] యీ చాపలమీద కుర్చోండి! [పరమేశంతో] ఆడవాళ్ళని అటువైపు గుమ్మంకుండావచ్చి అలా గదిలో కెళ్ళి కూర్చోమనండి!

పర- అలాగే! [బయటకు వెడతాడు. శాస్త్రి బయటనుంచి వచ్చి మంటపందగ్గర కూర్చొని అక్కడున్న సామన్లు సర్దుకుంటూ టాడు]

పురు- (సీతయ్యవంక చూస్తూ శాస్త్రితో) జరగవలసిన కార్యక్రమం చాలావుంది! తొందరగా కానియ్యాలి శాస్త్రిగారూ!

శా- చిత్తం! (అక్కడున్న పీటలు వగయిరాలు సర్దుతూ కొద్ది స్థాయిలో యేదో మంత్రం గొణుగుతూంటాడు వెంకటేశం అక్కడున్న చాపమీద కూర్చొని వాసుని కూర్చోమన్నట్లు సవిగచేస్తాడు. వాసు భయంగా పురుషోత్తంని చూసిపురుషోత్తంప్రక్కన నిలబడతాడు)

సీ- మా ఆలశ్యమేమీలేదు పురుషోత్తంగారూ! (మేళం ఆగుతోంది.

పు- ఊం! (జేబు గడియారం తీసి చూస్తూ) యిప్పటికే

చాలా ఆలశ్యమైంది! ముహూర్త ఘడియలు దాటక ముందే ఆ మూడుముళ్ళూ పడాలి సీతయ్యగారూ

దా- (లోపల్నుంచి వచ్చి పెళ్ళివారందరి చూస్తాడు)

సీ- అలాగే!

దా- (పురుషోత్తంని చూస్తూ సీతయ్యతో) ముదుపు చెల్లించేవా నాన్నా?

సీ- (మందలింపుగా) దాసూ! (తేరుకొని పురుషోత్తంతో రండి డబ్బిస్తాను!

పు- యిక్కడికి తీసుకురండి!

సీ- (సరేనన్నట్లు తలూపి లోపలకెడతాడు పరమేశం బయటనుంచి వచ్చి చాపమీద కూర్చుటాడు)

వెం- రావోయ్ మిష్టర్ దాసూ! యిలారా!

దా- హు! (హేళనగా) కట్నం ముట్టకుండానే కలుపుగోరు తనం చూపకండి!

వెం- (నవ్వి) మనంమనం అంతావకటే! సందేహించకు! నేను మీవాణ్ణే! కమాన్! (వాసునిచూచి నవ్వుతాడు)

దా- (వెంకటేశాన్ని సమీపించి వోకసారి పురుషోత్తంని కోపంగా చూసి వాసుతో హేళనగా) నమస్కారం వాసుదేవరావుగారూ!

వా- (లేచి సంతోషంతో) నమస్కారం! (కూర్చొని) రండి!

దా- మీ మర్యాదకు నా ధన్యవాదాలు! మీలాగే మేమూ కూర్చుంటే పనులెలా అవుతాయ్?

వెం- ఇవ్వాల్టికి యెలాగో కష్టపడండిమరి! (వాసుని చూస్తు దాసుతో) రేపటినుంచి బయటపని, యింటిపని; అంతా మనవాడే చూసుకుంటాడాయిరి!

వా- (మందలింపుగా) బావా!

వెం- పైగా కోపందేనికిరా! మొత్తం ఆరువేలుపోసి కొంటే ఆమాత్రం ఆదుకోపోతే యెలా?

పు- (స్థాయిపెంచి) వెంకటేశం!

వెం- (ప్రస్తుతం నేను వాసుతో మాట్లాడుతున్నాను! (దాసు వెంకటేశం నవ్వుతారు. పురుషోత్తం పల్లు బిగించి యేదో అనబోతాడు యింతలో సీతయ్య లోపలనుంచి వస్తాడు)

సీ- పురుషోత్తంగారూ! మీకియ్యావాల్సి కట్నం తాలూకు అయిదువేలు, లాంచనాలు తాలుకు వెయ్యి మొత్తం ఆరువేలు (అందిస్తూ) యివిగో తీసుకోండి!

పు- (పొట్లం అందుకొని ప్రూడటీయబోతాడు)

వెం- (పురుషోత్తంని చూస్తూ) వాసూ! ఆడబ్బుకోసమే యింత రాద్ధాంతమయింది! చాటూళ్ళి జాగ్రత్తగా లెక్కపెట్టుకోమని మీనాన్నకి చెప్పు. అందులో కొన్నినోట్లు కొంపతీసి గాలికెగిరిపోతే మళ్ళీతేలేడు ఆ పెద్దమనిషి! (పురుషోత్తం వెంకటేశాన్ని కోపంగా చూసి లోపలకు వెడతాడు. వెంకటేశం దాసు నవ్వుతారు. వాసు నొసళ్ళు చిట్లించి తలవంచుకుంటాడు)

ప— (లేచి సీతయ్యని సమీపించి) సీతయ్యగారూ! అప్పారావుగారి రమ్మాయి సుబ్బమ్మ పెద్దకూతురు సూరమ్మ పెళ్ళి యీ లగ్నానికే! అదీ మన చేతుల మీదనే కుదిర్చాం! వెళ్ళి ఆ రెండు అక్షింతలూ వేసి వెంటనే వస్తాను

సీ— చిత్తం! తొందరగా రండి!

వెం— రాకపోయినా యిబ్బందిలేదులే! అక్కడ పనేదో పూర్తిచేసుకొని, మళ్ళీ కొత్తదాన్నికోసం (హేళనగా) ప్రయత్నించండి! (పరమేశం గుటకలు మింగుతూ బయటకు వెడతాడు. అంతా నవ్వుతారు)

శా— యేమండి కన్యాదాతగారూ! యింకేమిటాలశ్యం?

సీ— మాదేంలేదు! కానియ్యండి!

శా— పెండ్లి కుమారుడుగారూ!

వెం— (హేళనగా) లేచి వెళ్ళండి!

వా— (దాసుని, వెంకటేశాన్ని చూస్తాడు)

దా— (హేళనగానవ్వి) వాళ్ళఫాదర్ చెప్పాలేమో!

వెం— యేమనుకున్నారుమరి! స్వేచ్ఛా స్వాతంత్ర్యాల్లో మన వాడికంటే పంజరంలో చిలుకనయం! కొంతలో కొంతన్నా స్వేఛ్ఛగా వుంటుంది! (వాసుని నీరసంగా చూస్తూ) పాపం పిచ్చి సన్యాసి, వట్టి అమాయకుడు (వాసు తెల్లబోతాడు)

పు- (లోపలనుంచి గబగబా వచ్చి) పైకం సరిగానేవుంది బావగారూ !

వేం- (గుండెలమీద చేతులు వేసుకొని నిట్టూరుస్తూ) బ్రతికేం !

సీ- ఒక్కమనవి. (పురుషోత్తం చేతులు పట్టుకొని) నేనింత కష్టపడ్డాననే విచారం నాకులేదు బావగారూ ! (కంట తడిపెట్టి) వొక్కగాన వొక్కపిల్ల! నే బ్రతికుండగానే దాన్ని వొకయ్య చేతిలో పెట్టాలనే అభిప్రాయమే నాలో పెనవేసుకుంది! అందుకే అహర్నిశలూ ఆరాట పడి కృషిచేశేను! యీ నాటికి నామనేవాంఛ నెర వేరింది ! యింతకంటే మించిన ఆనందం మరొకటి లేదు ! (విచారంగా) బావగారూ! మేముచేసిన పొర పాట్లు మనస్సులో వుంచుగోకండి ! క్షమించండి ! మా ఆశ యీనాటి నుంచి మీపిల్ల! దాన్ని మీచే తుల్లో పెడుతున్నా! మీ కడుపులో పెట్టుకొని మీ పిల్లతో సమానంగా చూస్తారు కదూ?

పు- (సీతయ్యని చూసి) ఊః! (ఆనందంతో) మీరింతగా చెప్పాలా బావగారూ! నాకుమాత్రం తెలియదూ? (వాసుని చూస్తు) యింకా కూర్చున్నావేరా వాసూ లే! పీటలమీద కూర్చో!

వా- (సరేనని తలూపి పీటలమీద కూర్చుంటాడు)

శా- ఓం! అయింముహూర్తాస్సు ముహూర్తోస్త్వి త్యను గృహ్ణాంతు! అయింముహూర్తోస్సు ముహూర్తోస్తు! తదేవ లగ్నం, సుతినం తదేవ, తారాబలం చంద్రబలంతదేవ, విద్యాబలం దైవబలం తదేవ, లక్ష్మీపతే, తేంఘ్రి యూంగంస్మరామీ! (అక్షింతలుతీసి పట్టుకొని) దేవ శ్యగృహే, మునయోవసం తిదేవానాం, కవయః! పార్థివాసః! (పురుషోత్తం కైంచూస్తాడు) దేవాయదప మేసు మనశ్యమాహే, దవిదేవాస వో దీర్ఘమాయు హః (పురుషోత్తంతో) పురుషోత్తంగారూ! యీఅక్షిం తలు పుచ్చుకోండి! (వెంకటేశంతో) భజంత్రీలను గట్టిగా వాయించమని చెప్పండి!

పు- (విసుగ్గా) మేళాలూ అక్షింతలూ సంగతలావుంచండి! యిప్పుడు టయమెంతయుందో తెలుసా?

శా- (తెల్లబోయి) అది మా తప్పా?

వెం- (పురుషోత్తంని చూస్తు) యెవరి తప్పయినా...

పు- ముహూర్తం మూడుగంటల, మూడునిముషాల, మూడు సెకండ్లకు! ముందు ముఖ్యమైనపని, అంటే ఆ మూడుముళ్లూ వేయించి, తర్వాత యీ పాత కార్యక్రిమమంతో ప్రారంభించండి! (సీతయ్యతో) అంతేనంటారా బావగారూ!

సీ- అన్నీ తెలిసిన పెద్దలు! మీకు తెలియన్దేముంది? మీ యిష్టప్రికారమే కానియ్యండి బావగారూ!

శా– అమ్మాయిని తీసుకురమ్మనండి!

సీ– (సరేనన్నట్లు తలూపి లోపలకు వెడతాడు)

వెం– మీయింట్లో ఆడంగులెవరూ కనిపించరేం?

దా– (బరువుగా) యెవరున్నారు? మా అమ్మగారు చనిపోయి చాలాకాలమైంది! యీ యిట్లో యింతవరకూ వున్న ఆడదిక్క మా చెల్లెలు వొక్కతే! దాన్నికూడా (పురుషోత్తంవంక చూస్తూ) రేపోమాపో మీ ఇంటికే పంపుతున్నాం! పోతే మిగిలేది మేము! నేనుమానాన్న

వెం– అదిసరే! బంధువులెవరూ రాలేదాని?

దా– పిలుస్తే రాకేంచేస్తారు? యెడాపెడి లేకుండా కట్నం కోసం తిరిగే సరికే కాళ్లు బొలపాలు కడితే, యింకా చుట్టాల్ని పిల్చే వోపికేది? (నీరసంగా) అయినా మాకా తాహతేది?

(సీతయ్య ఆశని తీసుకొచ్చి వాసు ప్రక్కనవున్న పీటమీద కూర్చోపెట్టి, కన్నీరు తుడ్చుకుంటూ వుంటాడు. తెరలో పోలీస్ విజిల్ అదేపనిగా వినిపిస్తుంది)

వెం– బాగుంది! అటూ రాలేదు బంధువులు, యిటూ రాలేదు!

దా– వాళ్ళకేం?

వెం– తాహతలేక మీరు పిలవలేదు! ఖర్చుఅవుతుందనే భయంతో వాళ్ళు పిలవలేదు!

శా- అయితే పురుషోత్తంగారూ! ముందే సూత్రధారణ కానిద్దామా?

పు- అనేగా చెప్పేను!

శా- భజంత్రీలను శ్లోకం గట్టిగా వాయించమని చెప్పండి!

వెం- [నవ్వి] భలే పెళ్ళి!

దా- న్యూమోడల్ 1956,

(బయటనుంచి మేళం, ప్రక్కసందులోనుంచి పోలీస్ విజిల్ వినిపిస్తుంది)

వెం- యేమిటా విజిల్సు?

దా- (పక్కవీధిలో యెక్కడో దొంగలు పడుంటారు! పోలీసులు పసికట్టి పట్టుకోవాలని ప్రయత్నిస్తున్నట్లున్నారు!

వెం- (నిట్టూర్చి) ఖర్మ!

శా- (అందరికీ అక్షింతలు యిచ్చి) అవిధ వాభవర్షాణి, శతం సాంగ్రంతు! ప్రసువంతు! తేజస్వీచ, యశస్వీచ ధర్మపత్నీ పతివ్రత! జనయద్బహుపుత్రాణీ మాచ దుఃఖలభేతక్వచిత్! భర్తాతే సోమపాన్నిత్వాం, భవే ధర్మపా రాయణః (మళ్ళీ పోలీసు విజల్ వినిపిస్తుంది. సీతయ్య తెల్లబోయి చూస్తూ క్షణం ఆలోచించి తేరుకొని ఆశనిమాసి తన చేతిలోవున్న అక్షింతల్ని పొంగి పొర్లే దుఃఖంతో వధూవరుల తలపైయుంచి అక్కడుండలేక గబగబా లోపలకు వెడతాడు) అష్ట

పుత్రాభవత్వంచ సుభగాచపతివ్రతా యింద్రస్సుతు యథేంద్రాణీ శ్రీధవస్య యథాశ్రియః! శంకరస్య యథా గౌరీ తద్వత్త మపిభర్తరి భాగ్యా (దాసుతో) లేసాయనా!

పు- శాస్త్రిగారూ! (విసుగుతో) మంత్రాలు తంత్రాలూ షార్టుకట్టుచేసి చదవయ్యా! ముందు మూడుముళ్ళూ వేయించండి!

దా- (పురుషోత్తంని చూస్తూ శాస్త్రితో) అంతే శాస్త్రిగారూ! (హేళనగా) వాళ్ళ పనయిందికాదూ? యెలాగో లాగుకొనియ్యండి!

శా- అలాగే! (గుక్క తిప్పుకోకుండా మంత్రాలు చదువుతూంటాడు బయటనుంచి మేళం పెద్దగా వినిపిస్తూంటుంది) పురుషోత్తంగారూ! మీ వియ్యంకుడుగారేరి! యిక్కడ కొద్దిగా పనుంది రమ్మనండి'

పు- (దాసుతో) అబ్బాయ్! మీ నాన్నని...

దా- అవసరమైతే పిల్చుకోవయ్యా!

వేం- [నవ్వి] అవవలసిన పనులయ్యాక మనిద్దరి కోపాలూ యెవర్ని పుద్ధరిస్తాయ్ బ్రదర్! (వీపుమీదతట్టి) పెద్దవాడు చెప్పాడు పాపం వెళ్ళిరా!

దా- (పురుషోత్తంని చూస్తూ వెంకటేశంతో) అంతేలెండి! (లోపలకెడతాడు)

శా- (వాసుతో) నాయనా! లేచి యెదురుగ వచ్చి ప్రూత ధారణ చెయ్! (వెంకటేశంతో) మేళాలు బాగా వాయించమని చెప్పండి!

వెం- (బయటకు చూస్తూ) ఊఁ ఊఁ!!

వా- (యెదురుగా నిలబడి సూత్రం పట్టుకుంటాడు)

శా- నాయనా! రెండు ముళ్ళూ గట్టిగా వేసి, మూడోముడి కొంచెం వొదులుగా వెయ్! (మేళంబాగా వినిపిస్తుంది)

వా- (ఆశ మెళ్ళో సూత్రం కట్టబోతాడు)

శా- (పెద్దగా) మాంగల్యం తంతునా నేనా మమజీవన హేతునా! కంఠేభద్నా ...

దా- (లోపలనుంచి పెద్దగా) ఆపండి! (వొక్కసారిగా అంతా నిశ్శబ్దమవుతుంది, అంతా ఆశ్చర్యంగా లోపలకు చూస్తారు. దాసు బక్కచిక్కిన సీతయ్య శవాన్ని భుజాన వేసుకొని వెర్రిగా చూస్తూ వొస్తాడు)

ఆ- ఆఁ! (విచారంతో పెద్దగా) నాన్నా! (గబగబా దాసుని సమీపిస్తుంది)

దాసు- (ఆశతో కలసి శీతయ్య శవాన్ని నెమ్మదిగా దింపుతాడు - అదే సమయంలో సీతయ్య జేబులోనుంచి వుత్తరం జారి క్రిందపడుతుంది! అది వెంకటేశం తీసి ఆదుర్దాగా లోలోన చదువుతాడు. వాసు తెల్లబోయి చూస్తూ కుడిచేత్తో మంగళసూత్రం పట్టుకొని నిలబడి పోతాడు) ఇదిగో నాతండ్రి! చూడండి! తనకూతుర్ని అల్లుణ్ణిహృదయపూర్వకంగా ఆశీర్వదిస్తానికనివచ్చారు!

# పెళ్ళి

వెర్రిగాచూస్తూ ఇవ్వండి శాస్త్రిగారూ అక్షింతలు!... యివ్వరేం? (అందర్నీ చూస్తూ) యెందుకలాచూస్తారు (శాస్త్రి నెమ్మదిగా బయటకు వెడతాడు) యీ స్థితిలో నాతండ్రిని చూస్తే మీఅందరికీ భయంగావుందా? [నవ్వి] భయపడకండి! పేదవాళ్ళ జీవితాలు ఎప్పుడో వొకప్పుడు యేదో కారణంగా, యేదోరకంగా మాసిపోవలసిందేగా! [వాసునిచూస్తూ] మంగళసూత్రం చేత్తో పట్టుకు అలాగే నిల్చుండిపోయావేం మిత్రమా మీనాన్న పట్టుదలకి మానాన్న తన ప్రాణాల్ని కొదవపెట్టి డబ్బుతెచ్చాడు! మీ చేతిలో పెట్టాడు. యింక భయంలేదు! యీ పెళ్ళి ఆగిపోయినా, యీ పిల్ల కాకపోయినా తప్పకుండా మళ్ళీ పెళ్ళవుతుంది! మా నాన్న మాకు దూరమైనా, (పురుషోత్తాన్ని కోపంగా చూపించి) మీనాన్న నీకళ్ళయెదుటే వున్నాడు! (నవ్వి) యింకా పదికుటుంబాలను కూల్చి, యింతకు పదిరెట్లు కట్నంతో మళ్ళీపెళ్ళిచేస్తాడు! అండగా పని చేయటానికి పెళ్ళిళ్ళ పరమేశం వుండనేవున్నాడు! తన కడుపు నింపుకునే నిమిత్తం తాహతలేని వాళ్ళకు పురెక్కించి, తప్పుడు సంబంధాలు కుదిర్చి పేదలను పాతాళానికి అణగతొక్కటానికి వుండనేవున్నాడు! బాగా (విచారించగా) వొక్కసారి నా తండ్రిని చూడండి! కష్టాల కోర్చుగోలేక, వాటితోనే కృంగి, కృశించి నశించిన మాతండ్రి కళేబరాన్ని చూడండి!

అంతా వొక్కసారి ఆనందించండి! (బయటనుంచి సబిన్సుపెక్టర్ యిద్దరు పోలీసులతో సహా వస్తారు)

పు- (శవాన్ని చూస్తూ) అంతా ఆశ్చర్యంగా వుందే!

ఇన- వుంటుంది! (అంతా వొక్కసారి వెనక్కి తిరిగి చూస్తారు)

దా- ఆఁ!

వెం- (ఆశ్చర్యంగా పోలీస్!

ఇ- చంపిందెవరు?

దా- ఇంకా తెలియటల్లేదూ? (పురుషోత్త ని చూపించి)ఆయన

పు- కాదు! అవసరమైతే యిక్కడున్న వాళ్ళందర్నీ అడిగి తెల్సుకోవచ్చు!

వె- (పురుషోత్తంతో) చంపింది నువ్వు కాకపోయినా చావటానికి నువ్వే కారణమని వూహిస్తే మంచిది!

పు- (మందలింపుగా) వెంకటేశం!

ఇన- అంతా తెల్సును! యీ సీతయ్యగారు నమ్మకంగా తను వుద్యోగం చేస్తున్న లక్షాధికారి రామలింగేశ్వర్రావింట్లో ప్రవేశించి యినప్పెట్టెలోని అయిదు వేల రూపాయలు అపహరించారు!

దా- (శూన్యంగాచూస్తూ) ఆఁ! (సీతయ్య శవాన్ని చూస్తాడు)

ఇన- అవును! పైకం తీస్తున్న సమయంలో నౌకరు నారయ్య నే వాడు చూశేడు! కారణాన్ని గురించి ప్రశ్నించగా కాన్పురెన్నుకి వెళ్ళిన లక్షాధికారే అర్జంటుగా పంప మన్నట్లు, తను పంపుతున్నట్లు అప్పటికప్పుడే కపట నాటకం సృష్టించారుట! యీయన గేటుదాటిన మరు

క్షణమే! రామలింగేశ్వరాావుగారు తిరిగి రావటం, నౌకరు చెప్పటం, మమ్మల్ని ఫోనులో పిలవటం, మేము రావటం, అంతా అప్పటికప్పుడే జరిగింది! మేము సీతయ్యగార్ని అరెస్టు చేయటానికని వచ్చాం! తీరా వచ్చేసరికి కథ అడ్డం తిరిగింది! నేరస్తుడు చంపబడి వున్నాడు! (అందర్నీ చూస్తూ) మర్యాదగా చెప్పండి అపహరించిన డబ్బెక్కడ? నేరస్తుడని చంపిందెవరు?

దా- (పురుషోత్తంని కోపంగా చూస్తాడు)

ఇన- (పురుషోత్తంని) మీరేనా?

పు- కాదు మాది పెద్దకుటుంబం! నేను పెళ్ళికొడుకు తండ్రిని! నౌకర్ని చంపాల్సిన అవసరం నాకులేదు! కట్నం తాలూకు అయిదు వేలు, లాంచనాలు తాలూకు వెయ్యి మొత్తం ఆరు వేలూ యిచ్చే తాహతలేక, మంచిసంబంధం మించిపోతున్నదనే ఆశకొద్దీ సీతయ్య దొంగిలించివుంటాడని మీమాటల్నిబట్టి అర్థమయింది! దొంగతనంచేసి కట్నం చెల్లించమని నేను కోరలేదు! కోరను! చేసిన అసభ్యప్పనికివచ్చే తలవంపులు భరించలేక ఆ భయంతోనే ఆత్మహత్యకు దారితీసి వుంటాడని అనకతప్పదు! ఆయన ఆత్మహత్యకుగాని, చేసిన దొంగతనానికిగాని, నాకెట్టి సంబంధంలేదు!

దా- ఎందుకుంటుంది? కట్నాల కోసం కత్తిపెంచి కుటుంబాలనుకూల్చే మీవంటి కపట నాటకసూత్రధారుల్ని కనికరించి విడిచిపెట్టకూడదు! ఇన్స్పెక్టర్ గారూ! వీళ్ళ

చేతులకు సంకెళ్ళు వేసి, చేయాల్సిన పరాభవం చేస్తే నే గాని, సంఘంలో చెలరేగుతున్న కుళ్ళు కూలదు!

పురు- (పెద్దగా) నోర్మూయ్!

దా- యింక మీ ఆటలు సాగవియను పురుషోత్తంగారూ!

పు- ఇన్స్పెక్టర్ గారూ! ముందాతని నోరు మూయించండి!

ఇ- ఆపని మీరు చేస్తే బాగుంటుంది! (పురుషోత్తంని సమీపించి) అపహరించిన డబ్బెక్కడ?

పు- (చెప్పటానికి సందేహించి వెంకటేశాన్ని ప్రక్కగా చూస్తాడు)

వెం- ఆలశ్యం దేనికి? యిచ్చెయ్!

పు- (వెంకటేశాన్ని కోపంగా చూసినిట్టూర్చి, గత్యంతరం లేక డబ్బు పొట్లం యిన్స్పెక్టర్ కి అందిస్తూ) యిదిగో పైకం! అందులో వుంది మొత్తం ఆరువేలు! దొంగ సొమ్మో దొరసొమ్మో నాకు తెలియదు! కట్నం రూపేణ మాకిచ్చారు! మేం తీసుకున్నాం!

ఇ- (పైకం పొట్లం అందుకొని తీసి చూస్తుంటాడు)

పు- తలాతోకా లేనివాళ్ళతో పొత్తు కుదుర్చుకున్నందుకు చాలా పశ్చాత్తాపపడుతున్నాను! (వాసుతో) యింకా చూస్తూ నిలబడతావేం రావాసూ! ఊఁ! లేచిరా (వెళ్ళబోతాడు)

వెం- ఎక్కడికి?

పు- ఇంటికి —

ఇ- యెవ్వరూ కాలు కదపటానికి వీల్లేదు!

వెం- ఇన్స్పెక్టర్ గారూ! అసంగతలాపు౦చి, దయతో ముం దాయన్ని అరెస్టు చేయి౦డి!

పు- ఆఁ!

వెం- ఈ వుత్తరం చూడండి యిన్స్పెక్టర్ గారూ! (ఉత్తరం యిన్స్పెక్టర్ కిస్తాడు యిన్స్పెక్టర్ ఆ వుత్తరాన్ని అందుకొని (లోనచదువుకుంటూ౦టూ౦) అసలీ సీతయ్య గారు దొంగ కాదు ఆయనలా మారటానికిగాని, ఆత్మ హత్య చేసుకోటానికి కాని కారకులు ముఖ్యంగా పురుషోత్తంగారే! యిటువంటివాళ్ల అత్యాచారాలు చూసి సహించి విడిచిపెడితే కాలం మరీ అధోగతి పాలవుతుంది! (విచారంగా) పాప! ఆ పెద్దమనిషి తన కూతురు క్షేమంకోసం. (పురుషోత్తంని చూ౦పించి యీ లుబ్ధాగ్రేసర, దుష్ట దురంధర పాతక ఘాతక చక్రవర్తి బెదిరింపు౦ క్రూరి నీచాతినీచమై యిన ప్రవర్తనకు లోనైదొంగతనం చేశాడు! తన పిల్లలకు తను దూరం కావటానికి ముఖ్యకారకులు (పురుషోత్తంని చూపించి) ఆయనే శ్రీయుత కాళేశ్వరరావుగారి వరకట్నని షేధ చట్టాన్ని అనుసరిస్తు యిటువంటి చదపురుగుల్ని కనికరించి విడిచిపెట్టకూడదు! ముందాయన్ని అరెస్టుచేసి అవసరమైతే నన్ను సాక్ష్యంగా వేసుకోండి! పిల్లుచేస్తున్న ఘోరాల్ని అక్కడేకే అంటే న్యాయస్థానంలోనే పది మంది పెద్దల సమక్షానా వెళ్ళడి చేస్తాను!

పు- (వెర్రిఆ వేశంతో) వంకటేశం!

ఇ– షటప్! దొంగసొమ్ము మీదగ్గరనుంచి పట్టుకున్నాం! అదీగాక వరకట్న నిషేద చట్టానుసారంగాకూడా మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాను! (పోలీసుతో బేడీలు తగిలించ మన్నట్లు సవిగచేస్తాడు. పోలీసు అల్లా చేస్తాడు)

పు– ఇన్సపెక్టర్ గారూ! నేను నిర్దోషిని—

వెం– ఆసంగతి కోర్టులో తెలియపర్చుకుంటే వుపయోగ ము టుందేమో!

ఇన– (వెంకటేశంతో) ఆ!...మీరెవరు? (మరో పోలీసు నోట్ చేసుకుంటాడు)

వెం– చెప్పుకోటానికి చాలా సిగ్గుపడుతున్నాను! ఆయన అల్లుణ్ణి!

ఇన– పేరు?

వెం– వెంకటేశ్వరరావు

ఇన– యింటిపేరు?

వెం– అవసరాలవారు–

ఇన– ఈ ఉత్తరం మీకెలా చిక్కింది?

వెం– సీతయ్యగారి శవాన్ని దాసు భుజానేసుకొస్తుంటే, ఆ వుత్తరం సీతయ్యగారి జేబునుండిజారి మంటపం దగ్గర పడింది! నేను తీసి చదివేను!

ఇన– మీరు చేసిన సహాయానికి చాలాథాంక్స్! యీ కేసులో యిక్కడున్న వాళ్ళందర్నీ సాక్షులుగా తీసుకుంటు న్నాను! (మరో పోలీసుతో) వీళ్ళందరిదగ్గరా స్టేటు మెంట్సు తీసుకో! (వెంకటేశంతో) నేవస్తానండి!

(పోలీసుతో) శవం కోసం అంబులెన్సు పంపుతాను! అంతవరకూ యిక్కడే వుండు ! (పురుషోత్త -వంక చూస్తూ) ఊఁ! పదండి! (ముందు ఇన్స్పెక్టర్ వెనక పురుషోత్తం, వెనక పోలీసు వెళుతుంటారు. వాసు పురుషోత్తం వెళ్ళే మార్గాన్ని చూస్తూంటాడు చేతిలో సూత్రం జారి క్రింద పడుతుంది మళ్ళీ తేరుకొని క్రిందపడ్డ సూత్రాన్ని తీసుకొని జేబులో పెట్టు కుంటాడు వెంకటేశంతో సహా, ఆశ దాసుల్ని సమీపిస్తాడు)

వెం- అయిపోయినదాని కోసం విచారించకండి!... ఇప్పటి కైనా సంఘం కళ్ళు తెరచి యీ మీ విషాద కథను ఆదర్శంగా తీసుకొని శ్రీ కాశేశ్వరరావు వరకట్న నిషేధ చట్టాన్ని అనుసరించి ముందుకివస్తే అంతేచాలు! అప్పుడే పరలోకం పయనించిన మీ నాన్న ఆత్మకు శాంతికల్గుతుంది! (యిద్దర్నీ నెమ్మదిగా లేవదీస్తాడు పెళ్ళిళ్ళనే వంకతో చెలరేగుతున్న అక్రమాలు అంతమవుతాయ్! వాసు పెళ్ళిపీటలమీద పరిచిన తెల్లగుడ్డను తెచ్చి సీతయ్య శవాని ముసుగుపెడ్తాడు. ఆశ దాసూ-రెప్పవాల్చకుండా చూస్తూంటారు, వాసు, వెంకటేశం, అక్కడున్న పోలీసు కంటతడి తుడ్చు కుంటారు)

— అయిపోయింది —

శ్రీ సరస్వతీ ప్రెస్, విజయవాడ - 1.